Photo by P. K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఇంటికి అండ

పంపినవారు :
జి. సుబ్బరామమ్మ - బందరు

త్వరలో వస్తూంది!



భరణీ వారి

# చండీరాణి



భానుమతి

రామారావు..రంగారావు..రేలంగి..

డైరెక్షన్... భానుమతి ..... నిర్మాత... రామకృష్ణ

స్టూడియో..భరణి




డిస్ట్రిబ్యూటర్లు :— ఆంధ్ర, సీడెడ్ : నవయుగ ఫిలిమ్స్, విజయవాడ & గుంతకల్లు
మైసూరు : విజయ టాకీ డిస్ట్రిబ్యూటర్సు, బెంగుళూరు—2
నైజాం : ది ఆల్ ఇండియా ఫిలిం కార్పొరేషన్, సికింద్రాబాద్

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవన్నీగాక బదులుచెప్పు - తొమ్మిదిమహత్వం - మైపుచిత్రాలు - రంగుల బొమ్మ కథ - ఫోటోశీర్షికల పోటీ మొదలైన మరిఎన్నో ఆకర్షణలు

## చందాదారులకు మనవి



పైనెల చందమామ యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీలోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడువచ్చు కంప్లైంట్లు, గతనెలలో చేరలేదనే కంప్లైంట్లు గమనించబడవు.

మేనేజరు

ఆదర్శ చిత్రమని అభినందిస్తూ ఆంధ్రలోకం తండోప
తండాలుగా దర్శించి ఆనందిస్తున్న మనోహర తెలుగు చిత్రము...

వినోదా వారి

# దేవదాసు

నాగేశ్వరరావు.... సావిత్రి... లలిత
రంగారావు..సి.యస్.ఆర్... పేకేటి

దర్శకత్వం... వేదాంతం రాఘవయ్య
సంగీతం... సుబ్బురామన్... పాటలు, మాటలు.. సముద్రాల
కెమెరా...రంగా ... కళ.. వాలి & గోడ్‌గాంకర్.



డిస్ట్రిబ్యూటర్లు :

ఆంధ్ర : వినోదా పిక్చర్సు సర్క్యూట్, విజయవాడ
సీడెడ్ : నవయుగ ఫిలిమ్స్, గుంటకల్
నైజాం : ప్రీమియర్ పిక్చర్సు, సికింద్రాబాద్
మైసూరు : తల్లం పిక్చర్సు సర్క్యూట్, బెంగుళూరు

# చందమామ

ంచాలకుడు :
చక్రపాణి'

'గ్రాసం ఒకరిదైనా వాసం తనది కావాలి' అని ఒక సామెత ఉన్నది. 'వాసం తనది కావాలి' అనగా మానవుడు స్వేచ్ఛగా మసలటానికి వీలైన వసతికోసం వాంఛిస్తాడన్నమాట. 'స్వేచ్ఛ' అనేది చాలా అమూల్యమైనది. సామాన్య మానవుడు స్వేచ్ఛను ప్రాణప్రదంగా ఎంచుతాడు. అందుకోసం ఎటువంటి త్యాగాన్నయినా చేస్తాడు. మహా సామ్రాజ్యాలను పాలించే సార్వభౌములను సైతం ఎదిరించగలడు. ఈ సంచికలోని 'సాహసుడు' కథలోని విక్రముడు వట్టి మాటలతో గాక, నిజమైన వీరుడు ఎట్టి త్యాగంచేయగలడో చేసి చూపాడు. అతని ధైర్య సాహసాలవల్లనే బలవంతుడైన శత్రురాజు, మారు ఆలోచన లేకుండా పలాయనమయ్యాడు.

సంపుటి 13 ఆగస్టు 1953 : సంచిక 2



# షరాబూ : గాడిదా

ఒక కాలంలో ఒక ఊళ్ళో
ఒక గాడిద ; దానిది అతితెలివి.
ఆ గాడిద యజమాని ముసలిషరాబు
పరమలోభి ; వానిది అతిదురాశ.

ఆ లుబ్ధాగ్రేసరు డొకనాడు
తన గాడిదపై ఒక ఊరేగుచు
చక్కని పచ్చిక బయలును చూసి
ఛప్పున దిగి యిటు లన్నాడు :





"నీకా ఊళ్ళో గడ్డి కొనాలి ప్రియం
ఇక్కడ బాగా మెక్కతివా నయం"
అని దానిని మేతకు విడిచివేసి
తానూ చెట్టుక్రింద విడిదిచేసె.

వచ్చిన స్వాతంత్ర్యంతో ఆ
పిచ్చిది చూపెను ముచ్చట ఎంతో
పచ్చని మెత్తని పచ్చిక చేలో
స్వేచ్ఛా విహారం చేసింది.

ఏంతగ లేచిన పచ్చిక కుచ్చుల
సంతోషంతో సగమే కొరుకుచు
గెంతుచు కేరుచు కదనుత్రొక్కుతూ
అంతట దొర్లుతు పరవడిల్లుతూ







'యజమానివి నీకు భయం సహజం
పారిపోయి నీ తలపండు కాచుకో
శత్రువనే చింత సుంత లేకుండా
కుత్తుకబంటిగ నన్ను మెయ్యనీ.

చదువని గాడిదనైనా చెపుతున్నా
చదివిన మనిషీ ఈ సామెత విని పో
మా పశుజాతికి మా యజమానే శత్రువు'
అని కూసి ఖరోత్తముడు పచ్చికమేసె.

సకిలించింది ఓండ్రించింది
ఇక సంగీతాన్నే అందుకొన్నది
ఆ ఖరహరప్రియ గానమజాలో
షరాబు శత్రువు ఒక డటీ వచ్చె.

అది గని షరాబు ఖరమును వేడెను
పారిపోవుదము వేగమె రమ్మని.
అదుపు లేని ఆ కొంటెగాడిద
'ఏం నీకంటే ఆతడు బరువా ?' అనె.

'కాదుగాని త్వరగా రా ఊరికి
పోదా 'మని గద్దించె షరాబు
'పో పో నీ శత్రువు నాకు శత్రువా
భయపడ్డానికి నాకేం గాడిదను ;



# అట్టమీది బొమ్మ

లక్కయింటిని తగులబెట్టిన భీమసేనుడు హిడింబవనంలో తన తల్లినీ, సోదరులనూ కనిపెట్టుకొని వున్నాడు. అక్కడ హిడింబాసురుడనే రాక్షసుడు తన చెల్లెలినిపిలిచి "ఈచుట్టుపక్కల ఏదో నరవాసన కొడుతున్నది. మనకు మంచి విందు దొరికేటట్టున్నది. పోయి చూచివస్తా"నంటూలేచాడు. అందుకు హిడింబి "అన్నా!–ఈపాటిదానికి నీవెందుకు? నేనే పోయివస్తా, ఉండు" అంటూ బయలుదేరింది.

దూరంనుంచే హిడింబి భీమసేనుని సుందరరూపం చూసింది. చూడగానే అతనిని పెళ్ళాడాలెనని కుతూహలం కలిగింది. వెంటనే ఆమె ఒక అందమైన చిన్నదాని రూపం తాల్చి, భీమసేనునివద్దకు వచ్చి, కుశలప్రశ్నలు వేస్తూనే తన అభిలాషను వెల్లడించింది. పెళ్ళివిషయంలో పెద్దల అనుమతి కావాలని చెప్పాడు భీమసేనుడు.

ఈ సంభాషణ జరుగుతూవుండగానే హిడింబాసురుడు అక్కడికి చక్కా వచ్చాడు. తన చెల్లెలు భీమునితో ప్రీతిగా మాటాడటంచూచి గర్జించాడు. అప్పుడు భీమసేనుడు వానితో మల్లయుద్ధంచేసి హిడింబుణ్ణి సంహరించాడు.

ఈ అలికిడికి పాండవసోదరులూ, కుంతీదేవీ నిద్రనుండి లేచారు. కుంతి ఎన్నో ప్రశ్నలు అడిగేసరికి, హిడింబి అనే ఆ సుందరి ఎంతో ఒప్పిదంగా సమాధానాలు చెబుతూవచ్చింది. ఆమె పాండవుల చరిత్రఅంతా తొలినుండి తుదివరకూ వెల్లడించేసరికి ధర్మరాజు ఆశ్చర్యపోయి, 'ఇదంతా నీకెలా తెలుసు?' నని ప్రశ్నించాడు. 'వ్యాసభగవానుని అనుగ్రహంవల్ల నాకు భూత భవిష్యత్తులు తెలుసు' నన్నది ఆమె.

హిడింబి ఇలా అంటూ, భీమసేనునికి తను భార్యగా ఉండేటట్టు అనుమతించవలసిందని ప్రాధేయపడింది.

ఆ సమయాన వ్యాసభగవానుడు ప్రత్యక్షమై, 'ఈ హిడింబి రాక్షసవనిత కదా అని సంశయించ పనిలేదు. పుట్టుకచేత రాక్షసే ఐనప్పటికీ, దైవాంశలుగల సుగుణఖని. మన భీమసేనుని సతి కావటానికి అన్నివిధాలా తగినది' అంటూ హిడింబి గుణగణాలు వర్ణించిచెప్పి, అప్పుడే భీమసేనునికీ హిడింబికీ వ్యాసభగవానుడు స్వయంగా పెళ్ళి చేయించాడు.



# కోతి - నీతి

బ్రహ్మదత్తుడు కాశీనగరాన్ని పాలించే కాలంలో ఒకప్పుడు బోధిసత్వుడు కపి రూపంగా జన్మించి, హిమాలయ పర్వతాలమీద ఒక వృక్షంపైన నివాసం చేస్తూ ఉండేవాడు.

పుట్టుకచేత వానరమే ఐనప్పటికీ, నరునిలో కనబడని మంచి గుణాలూ, చక్కటి నడవడికా ఆ వానరంలో కనిపిస్తూవచ్చినై. ఆ వానరం చాలా ఉత్తమమైంది. ఏమంటే: ఆ అరణ్యంలో వుండే సమస్తమైన జంతుజాలమూ తమ తమ కష్టసుఖాలు వెలపోసుకోవటంకోసం, సలహాలు పొందటంకోసం, ఆ మహాకపినే ఆశ్రయించేవి.

నిజానికి, ఆ మహాకపి బోధలు విన్న తరువాత వన్యమృగాలు తమ క్రూర స్వభావం మానుకొని, సాధువులై తరించినై కూడా. అంతేకాదు. అవి ఉదయానే పోయి గంగానదిలో స్నానంచేసి ఒక్కొక్కటి ఒక్కొక్క తీయని ఫలం తెచ్చి మహాకపికి గురుదక్షిణగా అర్పిస్తూవుండేవి.

అడవిజంతువులన్నిటికీ ఆ మహాకపి అండగా వుంటున్న సమయాన ఒకనాడు ఆ కపి చెవులకు "అయ్యో, చచ్చా! చచ్చా!..." అనే కేకలు స్పష్టంగా వినిపించినై.

వెంటనే కపి "ఇదిగో వస్తున్నా! వస్తున్నా!!" అని మారుకేక వేస్తూ, ఆ శబ్దం వచ్చిన దిక్కునకు పరుగెత్తింది.

చూడగా ఒక చెట్టు. ఆ చెట్టుకింద ఒక మురికిగుంట. అది ఎంతో లోతుగా వుంది. నిలువలేనంతగా దుర్వాసన కొట్టుతూవుంది. అందులో ఒక మనిషి పడి, పైకెక్క లేక గిలగిల తన్నుకొంటూవున్నాడు!

వాని దీనస్థితి చూచేసరికి కపి గుండె కరగిపోయి, కన్నీరు రాల్చింది. క్షణమైనా ఆలస్యంచేయక, ఆ గుంటలోకి దుమికింది. దుమికినవెంటనే ఆ మనిషిని తన వీపుపైన

ఆదినారాయణ





కపి కంటబడగానే ఆ మనిషికి మనసులో అనేకమైన భావాలు కలిగినై.

ఏమనుకొన్నాడో యేమో "ఓ కపీ!—నన్ను శ్రమపడి మోసితెచ్చి, అలసిపోయి ఉన్నావు. పాపం, నీవుకూడా కాస్తసేపు నిద్రపో!" అన్నాడు, ఎంతో అప్యాయంగా.

మనిషిమాటలు నిజమేనని నమ్మి, కపి బడలికచేత కన్నులు మూసుకొని నిద్రపోసాగింది. ఎప్పుడైతే తనను నమ్మి కపి నిద్రింపసాగిందో, ఆ క్షణమందే వాని మనసులో ఒక దురుద్దేశం కలిగింది—'ఈ కోతిని చంపి, దీని మాంసం ఆరగించినట్టయితే బాగుండునుకదా' అని.

కపి చేసినమేలు మరచినవాడు, దయాదాక్షిణ్యాలు కొంచెమైనా లేనివాడూ ఆ పరమదుర్మార్గుడు. ఆ వెంటనే ఒక పెద్ద బండ ఎత్తుకవచ్చి పడుకొనివున్న కపి నెత్తిమీద విసిరాడు.

ఎక్కించుకొని, ఒక్క ఎగురెగిరి వానిని గట్టుకు తెచ్చి చేర్చింది.

అంతేకాదు. మహాకపి వానిని గట్టుపైన వుండే ఒక చత్రాతిమీద పరుండబెట్టి, తినటానికి మంచిమంచి ఫలాలు తీసుకవచ్చి ఇచ్చింది. పైగా, వనంలోనించి మూలికలు తెచ్చి, వానికి తగిలిన గాయాలకు కట్లుకట్టింది. ఈ విధమైన ఉపచారాలు జరగగానే ఆ మనిషికి బాధలు తగ్గి, ఆదమరచి నిద్రించాడు.

కొంతసేపు గాఢనిద్ర ఐనతరవాత వానికి మెలుకువ వచ్చింది. కంటికి రెప్పలాగా, తనను కనిపెట్టి పక్కనే కూర్చొనివున్న

ఐతే, గురితప్పి ఆ బండరాయి కొంచెం అవతల పడటంచేత, అది కపికి తగలక తప్పిపోయింది. రాయి కిందపడగానే పెద్ద శబ్దమై, కపికి మెలకువ వచ్చింది. కపి మెలుకొనటం చూడగానే, ఆ దుర్మార్గుడి మనసులో రాయిపడినట్టయింది—'తానొకటి తలిస్తే దైవమొకటి తలచెకదా!'



అని. ఈ భయంచేత వానికి సగంప్రాణాలు ఎగసిపోయినై.

అప్పుడు, మేలుకొనివున్న మహాకపి ఆ మనిషి ముఖం చూచింది, కిందపడివున్న రాతిని చూచింది. వేరే సాక్ష్యం అక్కర లేకుండానే వాని ద్రోహచింత ఇట్టే దానికి అర్థమై పోయింది.

కాని, కపిమాత్రం ఇందుకు ఎంత మాత్రం ఆవేదనపడలేదు. "ఇప్పటికే సగం చచ్చిఉన్నాడు. అటువంటివాడిని మళ్ళీ చంపటం ఒక గొప్పకాదు 'అని తలచి, కపి వానినేమీ పలకరించకనే చూస్తూ ఊరు కొన్నది. ఐతే ఆ చూపే వానిని అగ్నిలాగా కాల్చివేయజొచ్చింది.

అప్పుడు, మహాకపిరూపంలో వున్న బోధి సత్వుడు వానికి ఇలా హితవు చెప్పాడు.: "నాయనా!—నేనేదో నీకు హాని చేస్తానని భయపడవద్దు. అయితే—నీవు చేయ బోయిన ఈ దుండగాన్ని ఇక్కడి జంతువులు ఏమాత్రం పసికట్టినా, నిన్ను నిమిషం కూడా నిలవనీయవు. అవి లేచి ఇక్కడికి రావటానికి ముందుగానే నిన్ను భద్రంగా ఈ అడవి దాటించివేస్తా. రా నాతో" అంటూ, వానిని కపి అడవి దాటించి, తన దారిని తను వెళ్ళిపోయింది.




వాడు అడవిదాటి వెళ్ళిన కొద్దిరోజులకే, చేసిన పాపాలకు ఫలితంగా అనేకమైన బాధలు పట్టుకుని పీడించినై. కడుపున పుట్టిన పిల్లలే వానిని యింటినుండి తరిమివేశారు. బంధువులు దూరమయ్యారు. ప్రాణమిచ్చే స్నేహితులు పెడమొగం పెట్టి తప్పించుకొనిపోసాగారు.

ఈ స్థితిలో ఆ దుర్మార్గుడు గత్యంతరం లేక ఊరువిడిచి పోపలసివచ్చింది. పోయి పోయి, మళ్లీ దూరాన వుండే అడవులకు చేరుకొని తను చేసిన పాపాలకు తగిన ప్రాయశ్చిత్తం పొందాడు. మిత్రద్రోహులకు ఎన్నటికైనా ఈగతి తప్పదుకదా!

# 'వనభూషణం'

మానవులలో శ్రావ్యంగా పాడి ఆనందింపజేసే గాయకులున్నారు. హాస్యపు మాటలచేత కడుపుబ్బ నవ్వించే పరిహాసకులూ వున్నారు. ఈ రెండు పనులూ చేసే చతురతగల ఒక పక్షి వున్నదంటే వినటానికి ఆశ్చర్యంగా లేదూ?

అమెరికాదేశపు అరణ్యాలలో ఒకరకపు రంగురంగుల పక్షి ఉన్నది. అది చూపులకు అతి అందంగా వుంటుంది. చక్కగా పాడుతుంది. దాని కంఠస్వరం ఎంతో శ్రావ్యంగా గంభీరంగా స్పష్టంగా ఉంటుంది. ఇది అర్ధరాత్రివేళ ప్రారంభించి ప్రాతఃకాలంవరకూ అలా పాడుతూనే ఉంటుంది. సంతోషంకలిగినప్పుడు రెక్కలూ తోకనూ విరివిచేసుకుని, నాట్యమాడుతూ గానంచేస్తుంది. అది పాడేటప్పుడు అనేకమైన పక్షులు గుమిగూడి ఒకేసారి పాడుతున్నట్టుగా మనకు అనిపిస్తుంది. దీనికి అమెరికాదేశస్థులు 'వనభూషణం' అని బిరుదిచ్చారు.



పాటలోనేగాక, తక్కిన పక్షులను ఏమార్చి పరిహాసం చేయటంలోకూడా ఇది గొప్ప నేర్పరి. ఒకసారి డేగలాగ కూస్తుంది. ఇది విని చిన్నపక్షులన్నీ భయపడి దాగుకొంటాయి. ఇంకొకప్పుడు ఆడుపక్షి మగపక్షిని పిలుస్తున్నట్టు నటిస్తుంది. ఈ కూత విని మగపక్షి గూటినుండి బయటికి వచ్చి, జతపక్షిని కానక మోసపోతుంది. ఇందుచేతనే దీనికి 'పరిహాసపక్షి' అనే పేరు సార్థకమైంది. రకరకాల జంతువుల, పక్షుల కంఠధ్వనులన్నీ ఈ వెక్కిరింపుపిట్ట అనుకరించగలదు. ఇది తరుచు వేటకాండ్రనుకూడా ఏమరిస్తూవుంటుంది.

ఈ పక్షికి నల్లత్రాచు జన్మశత్రువు. దీని పిల్లలను తినటానికి త్రాచు సరసరమని గూటిలోకి పాకిపోతుంది. ఐతే, పరిహాసపక్షి ఊరుకోదు. త్రాచు చెట్టు ఎక్కేటప్పుడూ, దిగేటప్పుడూ రోషంతో ఆవేశంతో పోరాడుతుంది. ముక్కుతో పొడుస్తుంది. రెక్కలతో కొడుతుంది. గోళ్ళతో రక్కుతుంది. పాము కదలక క్రిందపడివున్నా దానిని ఎత్తుకపోయి, ఎత్తునుండి నేలపై పడవేసి సర్పాన్ని చంపి, కసి తీర్చుకునేవరకూ ఊరుకోదు.




[గిరికోట చేరుకొన్న విజయుడు అక్కడ తన తండ్రిచావునుగూర్చి ఆరా తీయాలని చూస్తాడు. కొనకు అతని ప్రాణాలకే ముప్పు వస్తుంది. దీనినిగూర్చి ముందే తెలుసుకొన్న కరుణ అతనిని హెచ్చరిస్తుంది. విజయవర్మ కరుణను అక్కడే వదిలి ఎలాగైతేనేం ప్రాణాలు దక్కించుకొని బయటపడుతాడు. తరువాత చదవండి—]

విజయుడు భీమవర్మ చేతులలోనించి తప్పించుకొనికూడా, నాలుగు నెలలు గడిచి పోయాయి. ఈ మూడు నాలుగు నెలల లోను విజయలక్ష్మి బీసల్పూరు, కోసల్పూరు రాజ్యాలమధ్య నాలుగైదుసారులు చేతులు మారింది. ఇప్పుడు కోసల్పూరువారిదే పైచేయిగా వుంది.

అందువల్ల భీమవర్మగారికి పట్టపగ్గాలు లేకుండా ఉన్నాయి. అయన కోసల్పూరు రాజ్యానికి చెందిన మరికొంతమంది సర్దారులతోసహా నర్మదా నదితీరాన వున్న దేవపూరులో మకాంచేసి వున్నాడు.

అదే దేవపూర్‌లో ఊరిబయట నుండే ఒక పాడుబడిన సత్రంలో కూర్చుని పది పన్నెండుమందిధనుర్ధారులు తమలోతాము ఏదో మాట్లాడుకొంటున్నారు. అర్ధరాత్రి అవుతున్నది.

ఇంతలో ఒక దూత వచ్చి వారందరి మధ్య కూర్చునివున్న ఒక యువకునితో 'విజయా, భీమవర్మ నలుగురి సైనికులతో ఇప్పుడే ఎక్కడికో బయలుదేరుతున్నాడు,' అని చెప్పాడు.

వెంటనే విజయవర్మ నలుగురైదుగురు అనుచరులతో ఆ దూతను వెంబడించాడు.






ఆ దూత వారిని నర్మదాతీరాన్నే తీసుక పోతున్నాడు. కొంతదూరం వెళ్ళినతరువాత వారికి తమముందు కాగడావెలుగులో నడుస్తున్న చిన్న జట్టు ఒకటి కనుపించింది.

అది భీమవర్మ జట్టు ఐవుంటుందని వా రూహించారు. ఆ జట్టు కొంత దూరంపోయి నదిఒడ్డున పొదలు గుబురుగా వున్న ఒకచోట నిలబడిపోయింది. విజయవర్మ మొదలైనవారుకూడా కొంత దగ్గరకొచ్చి పొదలచాటున పొంచి ఏమి జరుగుతుందా అని చూడసాగారు. కొంతసేపట్లో పొదల అవలవైపునుంచి వారికి ఇంకొక జట్టు రావటం కనుపించింది. రెండు జట్టుల నాయకులూ పరిచయం చేసుకొన్న తరువాత ఏదో మాట్లాడుకొనసాగారు.

విజయుడు నిలుచున్నచోటికి వారు ఏమి మాట్లాడు కొంటున్నదీ సరిగ్గా వినిపించలేదుగాని, మధ్యమధ్య 'కరుణ అన్ని విధాలా తగిన పిల్ల' 'శబ్దవేధి...బహిరంగంగా వీలులేదు.' అనే మాటలు వినిపించాయి. కొంతసేపటికి మాటలు ముగిసాయి. భీమవర్మ వెనుదిరిగి తన నివాసంవైపు సాగాడు. విజయవర్మ అతనిని వెంబడించాడు.

భీమవర్మ బసచేసింది నర్మదాతీరాన వున్న ఒక పురాతన భవనంలో. భవనానికి మూడువైపుల ఎత్తయిన ప్రహరీగోడలు వున్నాయి. ఒకవైపున నర్మద, ప్రహరీగోడ కన్నా మిక్కలిగా రక్షిస్తున్నది. ఈ భవనం విజయవర్మ ఇదివరకే గుర్తుపట్టుకొని ఉన్నాడు. కాని లోపలికిమాత్రం చొరబడటానికి వీలులేకపోయింది.

ఇంతకుముందు జరిగిన సంభాషణను బట్టి విజయుడు - కరుణ ఈ భవనంలోనే ఉన్నదనీ, ఏదో బలవంతపు పెళ్ళికి ఏర్పాట్లు జరుగుతున్నాయని ఊహించాడు. అందువల్ల తరుణం మించకముందే అతడు



ఈ భవనంమీద దాడిచేసి కరుణను విడి పించక తప్పదని నిశ్చయించుకున్నాడు.

అందువల్ల అతడు భీమవర్మ, అతని అను చరులూ, లోనికి ప్రవేశించి సింహద్వారాలు మూయించిన తరువాత చుట్టుపట్ల తిరిగి తన దాడికి వీళ్లు చూచుకోసాగాడు. ఇలా చుట్టుపట్ల పరికించిచూచి, కాపలా చాలా కట్టుదిట్టంగా ఉన్నందువల్ల గోడలుదాటడం సాధ్యంకాదని, నది వైపునుంచి దాడి చేయటమే ఇంతకన్నా సులభమనీ అతడు తేల్చుకొన్నాడు. తేల్చుకొని తన అను చరులతో సత్రానికి మరలాడు.



కాని మరల కొద్దిదూరం వెళ్ళారో లేదో ఎవరో వారిని అడ్డగించారు. వీరు తప్ప కుండా భీమవర్మ అనుచరులే ననుకొన్నారు విజయుడూ అతని అనుచరులూ. ఇంకేం, కత్తులు దూసి ఆ చీకటిలో అడ్డగించినవారి మీద విరుచుకపడ్డారు. కాని ఇలా కొంత సేపు పోరు జరిగినతరువాత నువెవరంటే మీరెవరని పలుకరించుకొన్న తరువాతగాని ఉభయులకూ తమ పొరపాటు తెలిసి రాలేదు.

అప్పుడు తెలిసింది విజయునికి తను పోరింది పూర్వం కరుణను పెంచి పెద్ద దానినిగా చేసిన చంద్రదుర్గాధిపతితోనని. ఇద్దరికీ భీమవర్మబద్ధ శత్రువే. రెండవరోజు ప్రొద్దున్నే కలుసుకొని అన్ని విషయాలూ మాట్లాడుకొందామని నిశ్చయించుకొని ఇరువురూ ఎవరిత్రోవను వారు వెళ్ళి పోయారు.

మరుసటిరోజు ప్రొద్దున నర్మదాతీరాన విజయుడు చంద్రదుర్గాధిపతిని కలుసు కొన్నాడు. ఇద్దరికీ భీమవర్మ శత్రువుకావటం మూలాన స్నేహం కలియటానికి అట్టేసేపు పట్టలేదు. విజయునియందు చంద్రదుర్గాధి పతికి మంచి అనురాగమూ విశ్వాసమూ కలిగాయి. ఇద్దరూ కలిసి కరుణను రక్షించ టానికి ఉపాయాలు ఆలోచించి చివరకు




ఆ రాత్రే నదివైపునుంచి భీమవర్మనివాసం మీద దాడిచేయటానికి నిశ్చయించుకొన్నారు. కరుణను విజయుని కిచ్చి చేయటానికి తనకేమాత్రం అభ్యంతరం లేదని కూడా చంద్రదుర్గాధిపతి వాగ్దానంచేశాడు.

విజయుని అనుచరులలో పడవల పానయ్య అనే నడివయసు గలవ్యక్తి ఒకడు ఉన్నాడు. ఈ పానయ్యకు ఓడలు, పడవలు నడపటంలో చాలా అనుభవం వుంది. విజయుడు బసకు తిరిగివచ్చి అతనితో, 'ఏం పానయ్యా! రాత్రికి ఎక్కడైనాసరే పెద్ద పడవ ఒకటి దొంగిలించాలి. కొంచెం పని వుంది' అన్నాడు. 'ఓ, అదెంతపని? రేవులో వున్న పడవలన్నీ మనయ్యే' అన్నాడు పానయ్య.

రేవులో పడవలు చాలా ఉన్నాయి. వాటన్నిటిలో ఒక పడవమటుకు వీరికి బాగా ఉపకరించేలాగా వుంది. పానయ్య ఆ పడవను మనసులో గుర్తుపెట్టుకొని విజయునికి ఆ సంగతి చెప్పించాడు. చీకటి పడేటప్పటికి చంద్రదుర్గాధిపతి తన అనుచరులు ఇరవైపాతికమందితో అక్కడికి వచ్చాడు. విజయుడుకూడా తన అనుచరులను ఇరవైపాతికమందిని సిద్ధంచేసుకొన్నాడు.

ముందు ఒక ఐదారుగురు నిశ్శబ్దంగా ప్రాకి పడవ ఎక్కేశారు. ఎక్కి కాపలా కాస్తున్న ఇద్దరు మనుషుల్ని నోట్లో గుడ్డలు కుక్కి, కాళ్ళూ చేతులూ కట్టివేసి నిశ్శబ్దంగా ఒడ్డుకు చేర్చారు. వారిద్దరినీ ఎక్కడో దూరంగా తీసుకువెళ్ళి పడవేసి వచ్చారు. తరువాత అందరూ బిలబిలమంటూ పడవ ఎక్కేశారు. పానయ్య చుక్కాణి పట్టాడు. పడవ శరవేగంతో నదీజలాన్ని చీల్చుకొంటూ ముందుకు సాగింది.

'మబ్బులుపడుతున్నాయి. లక్షణాలంత బాగా లేవు' అన్నాడు పానయ్య ఆకాశం వంక చూచి. 'ఔను, లక్షణాలు చూస్తే

తుపాను వచ్చేటట్టేవుంది. ముహూర్తం అంత మంచిది కాదేమో?' అన్నాడు చంద్ర దుర్గాధిపతికూడా. 'చూద్దాం. ఏది ఎలా జరుగుతుందో!' అన్నాడు విజయుడు. 'తుపానేమిటి, భూకంపం వచ్చినా ఈరాత్రి కరుణను విడిపించక తప్పదు' అనుకొంటున్నాడు అతను మనసులో.

క్షణక్షణం చీకటి గాఢమవుతున్నది. పడవ భీమవర్మ నివాసం దరిదాపులకు చేరుకునేసరికి అంతటా కటిక చీకటి కమ్ముకొన్నది. కన్ను పొడుచుకున్నా కానరావటంలేదు. గాలికూడా బొత్తుగా సద్దుమణిగింది. 'వచ్చేశాం' అన్నాడు విజయుడు. ఎప్పుడు పడవ ఒడ్డుకు చేరుతుందా, ఎప్పుడు క్రిందికి ఉరుకుదామా అని ఊగిసలాడుతున్నాడు అతను.

ఎలాగైతేనేం పడవ భవనంప్రక్కనే ఒడ్డుకు చేరుకొన్నది. విజయుడు ముందు క్రిందికి దూకేశాడు. అతనివెనుకనే ఇంకా కొంతమందికూడా దూకారు. 'మిగిలిన వాళ్లంతా పడవలో ఉండండి. మేము ముందు పోయి స్థితిగతులు ఎలా ఉన్నాయో చూసివస్తాం' అన్నాడు విజయుడు. అలాగేనని చంద్రదురాధిపతితోసహా మిగిలిన వాళ్లంతా పడవలోంచి క్రిందికి దిగలేదు.




మేఘాలు ఆకాశంలో కుప్పతిప్పలుగా ప్రోగుకాసాగాయి. చుక్కలన్నీ మటుమాయమయ్యాయి. అకస్మాత్తుగా పెనుగాలి విజృంభించింది. విజయవర్మ తన అనుచరులతో జాగ్రత్తగా అడుగడుక్కీ ఆగుతూ ముందుకు సాగాడు. భవనం వెనుకవైపు గనుక కాపలావాళ్ళు ఎవరూ ఉండరని అతని ధైర్యం.

ఇంతలో అతని అనుచరులలో ఒకడు ఒక చిన్న బండకు కొట్టుకొన్నాడు. బండ అలాగే పల్లాన పడి దొరులుకొంటూ పోయింది. ఇంకేముంది, భవనం గోడమీది నుంచి ఒక బాణం రివ్వున వచ్చి అతని



అనుచరులలో ఒకనికి తగిలింది. 'వెనక్కు తగ్గండి!' అని విజయుడు ఆజ్ఞాపించే లోగానే పైనుంచి బాణాలవర్షం కురియసాగింది. అతని అనుచరులు వెనుతిరిగి పరుగెత్తారు.

ఇంతలో వర్షం, గాలీ ఒక్కమారే ప్రారంభమైనాయి. ఆ తుపాను హోరులో పారిపోతున్నవారి కేకలూ, వెంబడిస్తున్నవారి కేకలూ కలిసి మరింత కోలాహలం చెలరేగింది.

ఎలాగైతేనేం, విజయవర్మ, అతని వెంటనున్నవారూ పడవను సమీపించారు. కాని పడవ ఒడ్డునే లేదు. అప్పుడే పెను గాలిమూలాన నదిలో రేగుతున్న తరంగాల వల్ల ఒడ్డుకు దూరంగా వెళ్ళిపోయింది. దానిని మళ్ళీ ఒడ్డుకు చేర్చటానికి పానయ్యా వశం కావటంలేదు.

వెనుకనుంచి శత్రువులు తరుముకు వస్తున్నారు. ధారాపాతంగా వర్షం కురుస్తోంది. హోరుగాలివల్ల కాలు నిలపటానికి వీలులేకుండా ఉంది. మధ్యమధ్య మెరిసి పట్టపగలుగా చేస్తున్న మెరుపుల వెలుగులో శత్రువులకు గురి బాగా చిక్కుతున్నది. ఇక ఆలోచించటానికికూడా వ్యవధి లేదు. విజయవర్మా అతని అనుచరులూ నిర్భయంగా నదిలో దూకేసి పడవవైపు ఈదుకొనిపోసాగారు.

శత్రువులు ఒడ్డునవచ్చి నిలబడి ఈదుతున్నవారిమీదనే గాక, పడవలో ఉన్నవారి మీదకూడా బాణాలు కురిపించసాగారు. నదిలోనే బాణాలు తగిలినవారు అంతులేకుండా కొట్టుకుపోయారు. పడవ ఎక్కుతూ ఉండగా బాణాలు తగిలినవారు జారి ఏట్లోపడి కొట్టుకుపోయారు. పడవ మీద ఉన్నవారికికూడా కొంతమందికి గాయాలు తగిలాయి. వారికి బొత్తుగా రక్షణ లేకుండా ఉంది. వారుకూడా సాహసం వీడకుండా బాణాలు వదలసాగారు. కాని

రాళ్లచాటున పొదలమాటున దాక్కోవటానికి శత్రువులకు కావలసినంత అవకాశం ఉంది.

వారి దాడి ఈ విధంగా అగచాట్లపాలై ఊరుకొంది. చివరకు ప్రాణాలు దక్కించుకొని బయటపడితే చాలునని దేవునికి మొక్కుకోసాగారు. తుపాను తాపులకు పడవ ఎండుటాకులా వూగుతున్నది. ఈ క్షణమో మరుక్షణమో తల్లక్రిందులయ్యేటట్టు ఉంది. పడవమీద హాహాకారం చెలరేగింది.

'పడవ అవతలి ఒడ్డుకన్నా జేర్చు పానయ్యా!' అన్నాడు రొప్పుతూ విజయవర్మ. కాని ఆ తుపానులో పడవను అవతలి ఒడ్డుకు చేర్చటమంటే మాటలా?

ఇంతలో ఒక బాణం వచ్చి చంద్రదుర్గాధిపతికి తగిలింది. గాయపడి క్రింద పడిన అతనిని పెడగా మోసుకెళ్ళారు. గాయం గట్టిగా తగిలింది. ప్రాణభయం కూడా ఉన్నందువల్ల అతడు విజయుణ్ణి పిలవసాగాడు. విజయుడు వెళ్ళి విచారంగా అతనిప్రక్కన నిలబడ్డాడు.

'అబ్బాయీ! నీవు ఏ పక్షంవాడివి? బీసల్పూరా? కోసల్పూరా?' అని అడిగాడు అతను. 'భీమవర్మ కోసల్పూరువాడు.




అతడు నాకూ చండీదాసుకూ శత్రువు. అందువల్ల మీరు మమ్మలనికూడా బీసల్పూరువాళ్లేనని అనుకోవచ్చు' అన్నాడు, తాను ఏ పక్షానికి చెందినవాడో కూడా తెలియని విజయుడు.

'అయితే విను: అసలు నేను ఈ నగరం వచ్చింది కరుణకోసం కాదు. కరుణ ఇక్కడ ఉన్నదనికూడా నాకు తెలియదు. నే నిక్కడకు వచ్చింది శత్రువుల బలాబలాలు కనుక్కోవటానికి. ఆ పని కొంతవరకు నెరవేరింది. కాని నేను అసలు బ్రతుకుతానా, లేదా? అనే అనుమానం కలుగుతున్నది. నేను నీకొక వ్యక్తిపేరు

చెబుతాను. నేనే చనిపోయినపక్షంలో నీవు ఆ వ్యక్తివద్దకు వెళ్ళి ఇక్కడి స్థితిగతు లన్నీ చెప్పాలి. అతడు నిన్ను బీసల్‌పురా ధీశ్వరునికికూడా పరిచయంచేస్తాడు. ఏమో నీ అదృష్టమెలా వుందో ఎవరు చెప్పగలరు' అన్నాడు చంద్రదుర్గాధిపతి.

'మరి కరుణసంగతి ఏమిటి?' అన్నాడు విజయుడు. 'ఆ విషయం ఇక నేనేమీ చేయలేను. ఇక నీవు ప్రయత్నించుకోవల సిందే. ఇవ్వాళ నాచేతనైనది చేశాను' అన్నాడు చంద్రదుర్గాధిపతి. 'కాని మీరేమీ నిరాశ చెందనక్కరలేదు. మనం శత్రువుల బాణాల బారిని దాటి వచ్చేశాం. కొంచెం సేపటిలో ఒడ్డుకు చేరుకుంటాం. మీ గాయంకూడా మానిపోతుంది' అన్నాడు విజయుడు.

'ఏది ఎలాగైనా నా చింత తీరిపోయింది' అన్నాడు చంద్రదుర్గాధిపతి.

నిజంగా మరికొంతసేపటిలో వారు ఒడ్డుకు చేరుకొన్నారు. అప్పుడే తూరుపు కొంచెం తెలతెలవారుతున్నది. విజయవర్మ అతని అనుచరులూ పడవను రేవులో కట్టి వేసి ఖిన్నహృదయాలతో ఒడ్డుకు దిగారు. చంద్రదుర్గాధిపతి అనుచరులు గాయపడిన తమ యజమానిని మోసుకుంటూ బసకు తరలిపోయారు.

ఆ రాత్రి కరుణను విడిపించటానికి వారు చేసిన ప్రయత్నం ఈ విధంగా విపత్కరంగా పరిణమించింది.

అయితే ఈ ప్రయత్నంవల్ల విజయుడికి చంద్రదుర్గాధిపతి స్నేహంమటుకు లభిం చింది. 'ఇకముందు కరుణను విడిపించ టానికి నాకెవ్వరి సహాయమూ అక్కరలేదు. స్వశక్తిమీదనే ఆధారపడతాను' అను కొన్నాడు విజయుడు వజ్రసంకల్పంతో.

—(ఇంకా ఉంది)



# పులుల తమాషాలు

పులిజాతులలో ముఖ్యమైనవి పెద్దపులి, చిరుతపులి. మన దేశంలోకల్లా బెంగాల్ పులులే ఘనమైనవని అనుకొన్నాము. కాని, గొప్ప ఆకృతి, కండపుష్టి, ఎముకదిట్టం కలిగిన బ్రహ్మండమైన పులులు మంచూరియాలో ఉంటున్నవి. అవి ఇంత గొప్పగా ఉండటానికి అక్కడి చల్లదనం, మంచు, అనుకూలమైన శీతోష్ణస్థితులే కారణాలు.

ఇండియాలో పెద్దదైన పులి పది అడుగుల పొడవు, 550 పౌన్లు బరువు ఉంటుంది. పెద్దపులి సింహంకంటెకూడా ఎక్కువ జంతువులను చంపుతుంది. ఇండియాలో సగటున పులి ఏటా 800 ప్రాణులను చంపుతున్నట్లు లెక్కలవల్ల తేలుతున్నది.



పెద్దపులి తరువాతది చిరుతపులి. ఏటా సగటున 5000 చిరుతలు వేటాడబడుతున్నట్లు లెక్కలు చెబుతున్నాయి. ఐతే చిరుతలు మాత్రం ఊరకుండటం లేదు. అవీ సగటున ఏటా 350 మంది మానవులను పొట్టను పెట్టుకొంటున్నై.

నిజానికి, పెద్దపులులకంటే సింహాలకంటేకూడా చిరుతలను చూచి మనం ఎక్కువ భయపడాలి. ఏమంటే: చిరుతపులులు చెట్లెక్కగలవు. పెద్దపులుల కంటె ఎక్కువ నేర్పుతో అవి పొదలలో దూరి దాగుకొనగలవు. ఇందువల్లనే వేటగాండ్రకు పెద్దపులికంటె చిరుతపులే ఎక్కువ ప్రమాదకరం.

పొంచి శత్రువులమీదికి దూకటంలోకూడా చిరుతపులే పెద్దపులికంటే కూడా ఎక్కువ చాకచక్యం కలది. ఈ కారణాలచేతనే ఆఫ్రికాదేశస్థులు పెద్దపులి అంటే భయపడరు. కాని, చిరుతపులి అంటే వారికి చీకాకు.

ఆఫ్రికాదేశంలో పులులు వాటి ఆహారానికని బలిగొనే జంతువులను నొప్పి లేకుండా చంపుతై. అనగా జంతువులు బాధపడటానికి వ్యవధిలేనంత వేగంగా చంపుతాయన్నమాట.




పరోపకారి అయిన ధర్మసింధువు నేపాళ దేశానికి రాజుగా ఉండేవాడు. ఆయన త్యాగమూర్తి. ధర్మసింధువుకు మారువేషాలతో ఎంతదూరమైనా పాదచారిగా ప్రయాణం చేయటం మామూలు.

ఒకప్పుడు ధర్మసింధువు మామూలు ప్రకారం బయలుదేరి పోయి, కొన్నాళ్ళకు ఒక పర్వతప్రాంతం చేరుకొన్నాడు. మరి కొంతదూరంలో ఒక అగాధమైన లోయ తగిలింది. అటుపైన అయనకు దారీ తెన్నూ కనిపించ లేదు.

ధర్మసింధువు అక్కడనే నిలబడి ఆలోచించేటంతలో ఆ లోయప్రక్కనుండి ఒక అజానుబాహు వచ్చి ఎదుటపడ్డాడు. అతడు ధగధగ మెరిసే దుస్తులు వేసుకొన్నాడు, చక్కటి చేతికర్ర పట్టుకొనివున్నాడు. మంచి బలశాలి, అందగాడు, మాటకారిన్నీ. పెద్దమనిషిగాకూడా వున్నాడు.

ఆ పెద్దమనిషి, సామాన్యునివేషంలో కనపడే ధర్మసింధువుకు ఎదురువచ్చి "బిడ్డా! అలసిపోయినట్టున్నావే? ఎవరవు నీవు? ఎక్కడినించి వస్తున్నావు? ఎక్కడికి వెళ్ళాలి?—రా, నాయనా! నాతో వచ్చేసెయ్యి. ఇలాగే పాపం, వేళనక పాళనక ఎంతోమంది ప్రయాణాలు చేస్తూవుంటారు. అటువంటివారికి రాత్రిపూట బసయిచ్చి, సదుపాయం చేయకపోతే ఎలా నాయనా—రా, రా' అంటూ అప్యాయంగా పిలిచాడు.

ధర్మసింధువు తన ప్రయాణాన్నిగురించి చెప్పేసరికి, ఆ పెద్దమనిషి "అయ్యో నా తండ్రీ!—దారి తప్పి చాలాదూరం వచ్చేశావు. ఈ సమయంలో కొండలూ కోనలూ దాటుకుపోవటం ఎవరి శక్యం? ఐతేయేంలే, భయపడకు. నాతోపాటు భోజనం చేసుకొందువుగాని. చిత్రమైన పక్క చూపుతా, దానిమీద పండుకొందువుగాని. తెల్లవార

పి. రామకృష్ణ

గానే పోవచ్చు" అన్నాడు, ఎంతో దయతో. ఇలా ఒక పెద్దమనిషి అభిమానించి ఆతిథ్య మిస్తానంటే వద్దనటం మూర్ఖతకదా ?—ఈ ఉద్దేశంతో ధర్మసింధువు పెద్దమనిషి వెంబడే పోసాగాడు.

ఇద్దరూ కలిసి కొండమీద నడిచివెళుతూ వుండగా, దిగువ లోయలో సందడి వినిపించింది. ఆ సందడి చేస్తున్నది ఒకానొక వర్తకులగుంపు. వాళ్ళు గాడిదలపైన సరకు మూటలు వేసుకొని వస్తున్నారు. ఇది చెవిని పడగానే పెద్దమనిషి 'ఇప్పుడే వస్తా' నని ధర్మసింధువుతో చెప్పి, వాళ్లవద్దకు వెళ్లాడు.

"అయ్యో బాబుల్లారా!—ఈ అపరాత్రి వేళ ఈ ప్రయాణమేమిటి? రండి, నాతో రండి. మా యింట్లో ఇంత కడుపు చలవ చేసుకుని, రాత్రికి విశ్రమించి, తెల్లవారగానే లేచి మీదారిని మీరు వెళుదురుగాని. ఇవాళ నిజంగా ఎంతటి సుదినం! ఎంతపుణ్యం! ఇంతమంది అతిథులను సేవించుకునే భాగ్యం కలిగింది" అంటూ, అభిమానంగా వర్తకులందరనూ పిలిచాడు.

పెద్దమనిషి ఆ వర్తకులతో మాటాడుతూ వున్న సమయాన, అక్కడ ధర్మసింధువుకు ఒక వృద్ధుడు కనిపించాడు. వాడు కట్టెల మోపు యెత్తుకోలేక అవస్థపడుతున్నాడు.




వానికి సాయంచేదామని ధర్మసింధువు వెళ్ళేసరికి, వృద్ధుడు కుశలప్రశ్నలు వేశాడు.

అందుకు ధర్మసింధువు తన సంగతి సందర్భాలన్నీ వెల్లడించి, తరువాత "తాతా! —ఒక దయామయుడు కనిపించి, ఈ రాత్రికి ఇక్కడ ఉండిపొమ్మని నన్ను ఎంతో ఆప్యాయంగా కోరాడు" అని చెప్పాడు. ఈ మాటలకు వృద్ధుడు తల వంచి, పెద్దగా నిట్టూర్చాడు.

"హయ్యో! నిన్నూ మాయలో వేశాడురా బిడ్డా!—ముక్కుపచ్చలారని నిన్ను చూడగా నాకు కడుపు తరుక్కుపోతూవుందే. నీవనుకొంటున్న ఆ దయామయుడు నిజంగా



పెద్దమనిషి కాడుసుమా. పరమ దుర్మార్గుడు. వాడు చెప్పిన ఆ చిత్రమైన పక్క నిజమయిందికాదోయి నాయనా, అది మాయతల్పం" అంటూ మళ్లీ నిట్టూర్చాడు.

అంతటితో ధర్మసింధువు, తృప్తిపడి ఊరుకోలేదు. పెద్దమనిషిగా నటించే ఆ దుర్మార్గుణ్ణి గురించి ఇంకా చెప్పమని ఆత్రంతో అడిగాడు. అప్పుడు వృద్ధుడు ఇలా ప్రారంభించాడు:

"నాయనా!—వీడొక రక్కసుడు. పేరు ధూర్తకేతు. ఇష్టంవచ్చినట్టుగా బంగారం తయారుచేయాలెననే కాంక్షతో 'అసురశక్తి' అనే ఒక రాకసిని ప్రార్థించాడు. వాని భక్తికి మెచ్చి, అసురశక్తి ప్రత్యక్షమయింది. "కేతూ!—నీ భక్తికి మెచ్చాను. నీ కోరిక నెరవేరాలంటే, అదుగో ఆ మూలనున్న మంచం తీసుకో. దీనిపేరు భల్లూకతల్పం. ఇది ఎలుగుబంటి రోమాలతో తయారైన మహిమగల మంచం. ఈ మంచానికి సరీగా సరిపడే పొడవుగల నరుణ్ణి తెచ్చి నాకు బలి ఇచ్చిననాడు నీ కోరిక నెరవేరుస్తా" నని చెప్పి మాయమైంది.

ధూర్తకేతు సంతోషించి గుడిలోని ఆ తల్పం ఇక్కడికి తీసుకవచ్చాడు. ఈ భవనం నిర్మించాడు. లోయదగ్గిర కాచుకొని వుండి వచ్చేపోయే బాటసారులను 'అతిథ్య మిస్తాను ర' మ్మంటాడు. తన తల్పాన్ని గురించి ఎంతగానో పొగడుతూ చెప్పి అమాయకులైన ప్రయాణికులను ఆకర్షించి మోసగిస్తాడు. ఎంతకాలంనుంచో ప్రజను తన భవనంలోకి లాక్కొంటూ, తల్పంమీద పడుకొన్నతరువాత వాళ్ళ పొడవు యెక్కువయితే తల్పానికి సరిపడేటట్టుగా కాళ్లకు కట్టుకట్టి పొట్టిచెయ్యటానికి చూస్తాడు. పొడవు సరిపోకపోతే నిర్దాక్షిణ్యంగా కాళ్ళు పట్టి సాగదీస్తాడు. ఈ యాతనలు భరించలేక జనం చస్తున్నారు. ఐతే, ఆ తల్పానికి సరీగా సరిపడిన పొడవుగలవాడిని

నేనొక్కణ్ణే..." అనిచెప్పి వూరకున్నాడు. ఇలా అనే సరికల్లా, ధర్మసింధువు "మరి తాతా!—నువ్వింకా బతికేవున్నావే! నిన్ను శక్తికి బలియివ్వలేదా?" అని అడిగాడు. అందుకు ముసలివాడు ఇలా చెప్పాడు:

"నాయనా!—చాలా కాలంక్రిందట నీలాగే నేనూ ఈదారిని ప్రయాణం చేయవలసి వచ్చింది. నన్నూ ధూర్తకేతు ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించి తన భవనం లోపలికి తీసుకువెళ్ళాడు. దివ్యమైన భోజనం పెట్టించాడు. ఆ తల్పం చూపించి హాయిగా నిద్రించమని చెప్పి వెళ్ళిపోయాడు.

"మామూలుగా పడుకొన్నాను. నాపొడవు ఆ తల్పంకన్న సుమారు ఒకమూర ఎక్కువగా ఉన్నది. ఇదేదో చిత్రంగా ఉన్నదనిపించింది. ఎంతకూ నిద్రపట్టిందికాదు. అప్పుడు తలగడ తీసి కాళ్ళవైపు తల పెట్టుకొని, కాళ్ళుచాచి పడుకొనేసరికి, నా పొడవు ఆ తల్పం పొడవుకు సరిగా సరిపోయింది, తల్పంలో వుండే మర్మం తెలిసిపోయింది. నిద్ర పట్టకపోయినప్పటికీ కళ్ళు మూసుకొని అలానే పడుకొన్నా.

"ఒక రాత్రివేళ ధూర్తకేతు వచ్చి చూచేసరికి, నేను తల్పానికి సరీగా ఎచ్చుతగ్గులేమీ లేకుండా ఉండటం గమనించాడు. ఇంత



కాలానికి తన "శక్తి"కి తగిన మనిషి దొరికాడుకదా అని ఉప్పొంగిపోయాడు. నాటినించీ వాడు నన్ను ఎంతో దయగా చూస్తూ, ఏ లోపమూ రాకుండా పోషిస్తూ వచ్చాడు. తరువాత బలి వేయటానికి సుముహూర్తం పెట్టించాడు. ఈ సంగతి పరిచారకులవల్ల నాకు ముందుగానే తెలిసింది.

"బలికి ముందటిరాత్రి అర్థరాత్రివేళ మళ్ళీ నా గదిలోకి వచ్చి ఒకసారి నన్ను వాడు చూచాడు. అప్పుడు కావాలనే, నేను తలవైపు సవ్యంగా పడుకొనివున్నా. చూడగా నా కాళ్ళు తల్పానికి సుమారు మూరెడు పొడవు పెచ్చుగా కనిపించినై. ఇది



చూస్తూనే ధూర్తకేతు తబ్బిబ్బులైపోయాడు. వాడికి ఏమీ అంతుపట్టలేదు. 'గత రాత్రి తల్పానికి సరిగావున్న మనిషి తెల్లవారేసరికి హెచ్చుపెరిగి ఉన్నాడేమిటి!' అనుకొని ఆశ్చర్యపడ్డాడు.

"తల్పమైతే అత్రంకొద్దీ తెచ్చాడేగాని, "శక్తి"ని అడిగి ఈ కీలకం వాడు తెలుసుకోలేదు. ఆ "శక్తి" వీడికి చెప్పనూ లేదు. ఇప్పుడు ఆశ్చర్యం కలిగి, ఈరహస్యం ఏమిటో నన్ను చెప్పమని కూర్చున్నాడు. నేను చెప్పలేదు. నన్ను నానా యాతనలూ పెట్టాడు. నేను నా పట్టు వదలలేదు. లాభం లేక, విసిగి వేసారి నన్నొక బానిసగా చేసి



వేశాడు. వాడు తోడమని చెప్పినన్ని నీళ్ళూ తోడాలి. మోయమన్నన్ని కట్టెలమోపులు మోయాలి. నన్ను ఎన్నివిధాల హింసించినా, ఇప్పటివరకూ ఆ కీలకం నేను వాడికి వెల్లడించలేదు. ఇంతవరకూ ఆ తల్పానికి సరిపడి, శక్తిబలికి పనికివచ్చే మనిషి మరొకడు దొరకనూ లేదు..."

అని చెప్పేటంతలో లోయలోని వర్తకుల గుంపును వెంటబెట్టుకొని ధూర్తకేతు చక్కా వస్తున్నట్టు చప్పుడయింది.

ఇది కనిపెట్టి, ముసలివాడు ధర్మసింధువుకు ఒకేఒక రహస్యం చెవిలో చెప్పాడు. సంతోషంతో సరేఅన్నాడు ధర్మసింధువు.

ఆరోజున దొరికిన అతిథులందరిలో ధర్మసింధువే అందంగా పొందికగా కనబడటంవల్ల, దివ్యమైన భోజనం పెట్టించి, ముందుగా ధర్మసింధువునే తన తల్పం మీద పడుకోమన్నాడు ధూర్తకేతు. ధర్మసింధువు ఏమీయెరుగని అమాయకునిలాగా పోయి, అటువంటి తల్పంమీద పడుకోవటం తనకు కొత్తఅయినట్టు నటించాడు. నటించి, కాళ్ళవేపు తలపెట్టుకు పడుకున్నాడు.

ధూర్తకేతు ఒకరాత్రివేళ వచ్చిచూడగా, అతను తల్పానికి సరిగా సరిపోయివుండటం గమనించి పొంగిపోయాడు. ఈ సందట్లో



వాడు వర్తకులగుంపును మరచేపోయాడు. నాటినుంచీ ధర్మసింధువుమీదనే దృష్టిపెట్టి, అతనిని అన్నివిధాలా సదుపాయంగా పోషిస్తూవచ్చాడు. వానిని నమ్మి స్వేచ్ఛగా వదిలిపెట్టాడు. ధర్మసింధువుకూడా యజమానిపట్ల విశ్వాసంగానే ఉంటూవచ్చాడు. ఇన్నాళ్లకు తన దేవి బలికి తగినవాడు దొరికాడుకదా అనే సంతోషంతో ప్రపంచమే మరచి సంచరింపసాగాడు, ధూర్తకేతు.

ఈలోపల ధర్మసింధువు ఏన్నోసారులు ముసలివానిని కలుసుకుని, సలహాచేశాడు. ఇద్దరూ కూడబలుక్కొని ఒక నిశ్చయానికి వచ్చారు.

ఆ నిశ్చయంప్రకారం, ఒకరోజున ధూర్తకేతుకు మంచిమాటలు చెప్పి, వాడు కాళ్ళవైపు తలపెట్టుకొని తల్పంమీద నిద్రించేటట్టు ధర్మసింధువు యుక్తిచేశాడు. ధూర్తకేతు ఆ తల్పానికి సరీగా సరిపడ్డాడు. వాడు నిద్రించే సమయాన తల్పంతోసహా ధూర్తకేతును దేవి విగ్రహంముందు పెట్టటానికి ఇదివరకే ఏర్పాటుచేశాడు.

దేవి ప్రత్యక్షమయింది. తల్పానికి సరీగా సరిపడివున్న ధూర్తకేతును ముసలివాడూ ధర్మసింధువూ కలిసి బలిచేయబోయారు. కాని, దేవి తన భక్తుడైన ధూర్తకేతుపైన దయదలిచి, వాడికి మరొక ఉపాయం చెప్పి సాగనంపింది. వాగ్దానంప్రకారం అసురశక్తి బంగారంచేసే యోగం ధర్మసింధువుకు చెప్పింది.

ధర్మసింధువు తరువాత బోలెడంత బంగారం తయారుచేసి, లోయలో భవనం వశపర్చుకున్నాడు. ముసలివానిని గురువుగా భావించాడు. ధూర్తకేతులాగాకాక ధర్మసింధువు, ఆ దారినివచ్చే బాటసారులందరకూ అతిథ్యమిచ్చి, ఆదరించి పరోపకారదీక్షతో జీవితం సార్థకం చేసుకొన్నాడు.



# మలుపు తిరిగినా, రైలుబండి పట్టాలు తప్పదు. ఎందుచేత?

రైలుబండి సూటిగానూ పోతుంది, మలుపులు తిరిగీ పోతుంది. అది యెంత వేగంగా పోయినా, మలుపు తిరిగేటప్పుడు సైతం పట్టాలు తప్పిపోదు. ఇది ఎలా సాధ్యమవుతున్నది?

ఇక్కడ 'చలనసూత్రాన్ని' గురించి న్యూటన్ శాస్త్రజ్ఞుడు చెప్పిన ప్రాథమిక విషయం మనం తెలుసుకోవాలి. అది ఏమిటీఅంటే—కదులుతూవున్న ఏ వస్తువైనా ఆటంకం కలగనంతవరకూ సూటిగా పోతూనేవుంటుంది. ఇది దాని స్వభావం.



ఈ సూత్రాన్నిబట్టిచూస్తే, సూటిమార్గాన్నుంచి మలుపు తిరగవలసివచ్చినప్పుడల్లా రైలుబండి పట్టాలు తప్పిపోవలిసిందేకద! కాని, అలా జరగటం లేదు. దీనికి మొదటికారణం: రైలుచక్రాలకు ఒకవైపున ఉండే అంచు యేర్పాటు. ఐతే, రైలు పట్టాలు తప్పకపోవటానికి ఇదిఒక్కటే కారణంకాదు.

ఈ బొమ్మ కిందభాగంలో విడివిడిగా వున్న చక్రాలకేసి చూడు. రైలుబండి చక్రం, ఎడమవైపు బొమ్మలో చూపినట్టు చదునుగా కాక, కుడివైపునున్న మాదిరి ఏటవాలుగా ఉంటుంది. ఇలా ఏటవాలుగా ఉండటంవల్ల జరిగేదేమిటంటే—రైలు కదిలేటప్పుడు చక్రాలు బయటికి నెట్టబడుతూవుంటయి కాని, అవి పట్టాలు తప్పిపోకుండా చక్రాలకుండే అంచులు వాటిని నిరోధించి సరిఐన స్థానంలో ఉంచుతాయి.

ఇదిగాక మరిఒక ఏర్పాటు ఉన్నది: మలుపుతిరిగే చోట రైలుపట్టాల అమరిక రైలుకు నిర్ణయింపబడిన వేగానికి తగినట్టుగా వుంటుంది. దీనినిబట్టి కూడా, మలుపులలోసైతం రైలుబండి పట్టాలు తప్పిపోకుండా సూటీగా పోయే మోస్తరుగానే పరుగు సాగించటానికి వీలవుతున్నది.




# మాణిక్యవాచకర్

పాండ్యరాజులు మధురాపట్టణాన్ని ఏలుతూవుండే కాలంలో, ఒక రాజువద్ద 'వాదవూరార్' అనే మంత్రి ఉండెవాడు. వాదవూరార్ శివభక్తిపరాయణుడు.

ఒకరోజున రాజు వాదవూరార్‌ను పిలిచి "ఓయీ మంత్రీ!—నీవు చోళరాజ్యమంతా తిరిగి, ఎంత ధనమైనాసరే వెనుదీయక వెచ్చించి, మన ఆస్థానానికి పేరుతెచ్చే ప్రశస్తమైన మేలుజాతి గుర్రాలను తీసుకు రావలిసింది" అని చెప్పి పంపాడు.

సరేనని, రాజాజ్ఞ ప్రకారం వాదవూరార్ బయలుదేరి వెళుతూవుండగా, దారిలో ఒక పొగడచెట్టుకింద ఒక వృద్ధ బ్రాహ్మణుడు ఎదురయ్యాడు.

గొప్ప తేజంతో ప్రకాశిస్తున్న ఆ బ్రాహ్మణ్ణి చూచీ చూడటంతోనే వాదవూరార్ మనస్సులో ఒక విధమైన సంచలనం కలిగింది. అతడా వృద్ధుణ్ణి మహానుభావునిగా ఎంచి సాష్టాంగపడ్డాడు. "మహాత్మా!—నాకు చిన్నప్పటినుంచీ కుతూహలంగా వుండే ముక్తిమార్గం నీవు చూపగలవని తోస్తున్నది. కనుక, తరణోపాయం చూపి పుణ్యంకట్టుకోవలసింది" అంటూ వేడుకొన్నాడు.

అప్పుడు వృద్ధబ్రాహ్మణ రూపంలో వున్న పరమశివుడు నిజరూపంలో సాక్షాత్కరించి, వాదవూరార్‌కు తరణోపాయం అనుగ్రహించి అదృశ్యమయ్యాడు.

ఆ క్షణంనుంచీ వాదవూరార్‌కు కవితావేశం కలిగింది. తన ఇష్టదైవమైన శివుని గురించి అత్యద్భుతమైన పద్యాలు ఆశువుగా చెప్పనారంభించాడు.

వాదవూరార్ చెప్పే మధురకవిత్వానికి పరమేశ్వరుడే తన్మయుడయి, ఒకనాడు ప్రత్యక్షమయ్యాడు.

"భక్తాగ్రేసరా!—నీ నోటనుండి వెలువడే పలుకులు ఒక్కొక్కటి ఒక్కొక్క

ఎస్. పద్మనాభం




మాణిక్యం విలువగలది. ఇంతటినుండి లోకులు నిన్ను 'మాణిక్యవాచకర్' అని పిలుస్తారు" అని చెప్పి దీవించి అంతర్హితుడయ్యాడు.

శివభక్తుడుగా మారిన వాదపూరార్ తన చేతిలో వుండే రాజద్రవ్యాన్ని అంతటినీ వినియోగించి ఒకచోట శివాలయం నిర్మించి, ఇష్టదైవాన్ని కొలుస్తూ అక్కడనే ఉండిపోయాడు.

ఇంతలో రాజావారి భటులు వెతుక్కొంటూవచ్చి, వాచకర్‌ను తక్షణమే దర్బారుకు రమ్మనమని ప్రభువుల ఆజ్ఞ అయిందని చెప్పారు.

వాళ్ళవెంబడే వాచకర్ మధురానగరుకు వెళ్ళాడు. ఈ ఆలస్యానికి ప్రభువు కోపించి తనను పీడిస్తాడని మాణిక్యవాచకర్‌కు తెలుసు. అతను అనుకున్నట్టుగానే, గుర్రాలు లేకుండా వచ్చినందుకు రాజు, వాచకర్‌ను ఖైదుచేయించి, అనేకవిధాలుగా హింసలు పెట్టాడు.

ఇదిచూచి పరమేశ్వరుడు విచారించి, తన భక్తుణ్ణి రక్షించటానికని ఒక చిత్రమైన ఉపాయంపన్నాడు. అడవిలోవుండే నక్కల గుంపును మేలురకం గుర్రాలుగా మార్చివేశాడు. తను ఒక గుర్రపువాని వేషం వేసుకొని, ఆ మాయగుర్రాలను రాజు వద్దకు తీసుకువెళ్ళాడు.

గుర్రాలను చూడగానే రాజు ఆశ్చర్యభరితుడయ్యాడు.

అప్పుడు ఆ గుర్రపువాడు రాజుతో "ప్రభూ!—నేను మాణిక్యవాచకర్ స్నేహితుడను. చోళరాజ్యమంతా తిరిగి, ఎంత ధనమైనాసరే వెనుదీయక మేలుజాతి అశ్వాలను తెమ్మని నన్ను అతను నియమించివున్నాడు. ఇవే ఆ గుర్రాలు" అని చెప్పాడు. మంత్రిపట్ల జరిగిన తొందరపాటుకు రాజు విచారించి, వెంటనే వాచకర్‌ను ఖైదునుండి విడుదలచేయించాడు.






కొత్తగా వచ్చిన గుర్రాలను సాలలోపల కట్టివేశారు రాజభటులు. ఐతే—ఆ రాత్రే, గుర్రాల రూపంతో వున్న ఈ నక్కలన్నీ వాటి నిజరూపం పొంది, సాలలో వుండే అసలుగుర్రాలను కరిచివేసి, అడవిలోకి పారిపోయినై.

ఇందుకు ఫలితంగా రాజావారి సాలలో వుండే మేలుజాతి గుర్రాలు చాలవరకుచచ్చి పోవటం, కొనప్రాణాలతో బతికివున్నప్పటికీ ఎందుకూ పనికిరాకుండాపోవటం జరిగింది.

ఈ సంగతి తెలియగానే రాజు ఉగ్రుడయ్యాడు. మాణిక్యవాచకర్ మాయలు పన్నుతున్నాడనీ, తనను మోసంచేస్తున్నాడనీ తలచి, ఈసారి మునుపటికంటె హెచ్చుగా మంత్రిని హింసలు పెట్టసాగాడు.

తన భక్తునిపట్ల రాజు చేసే దుర్మార్గాలకు రుద్రుడు ఉగ్రంతాల్చి, తలపైన వుండే గంగను భూలోకానికి వదిలిపెట్టాడు. వైగానది అకస్మికంగా పొంగిపోయింది. మధురాపట్టణం తుడిచిపెట్టుకు పోతుందా అని రాజుకు భయంపట్టుకుంది.

ఈ ఆపదసమయంలో చేసేదేముంది? జనులంతా మట్టి తవ్విపోసి, నగరుపక్కగా ప్రవహించే వైగానదిగట్టును దిట్టపరచమని అజ్ఞ ఇచ్చాడు.

ఊళ్లో చిన్నాపెద్దా అందరూ శ్రమపడి మట్టి తవ్విపోస్తున్నారు. అయితే, ఒక్క ముసిలిదిమాత్రం వృద్ధాప్యంవల్ల రాజాజ్ఞను నెరవేర్చలేక విచారిస్తూ కూర్చుంది.

అప్పుడు కూలీచేసే ఒక చిన్నిబాలుడు అక్కడికి వచ్చాడు. వచ్చి ఆ ముసిలిదానితో "అవ్వా, అవ్వా!—రాజు ఏంచేసిపోతాడో అని నువ్వేమీ దిగులుపడకు. నువ్వు చేయవలసిన పనికూడా నేను చేసిపెడతాలే!" అని ధైర్యం చెప్పాడు.

బాలుని మాటలు వినగానే ఆమెకు ప్రాణం లేచివచ్చి, ఎంతో సంతోషించింది. కాని, తీరా ముసలిదానిని వెంటబెట్టుకొని





ఆ బాలుడు నదివద్దకు వచ్చిన తరువాత పనిపాటులు చేయలేదు సరికదా, ముసలిది మూటకట్టి తెచ్చుకున్న రొట్టెతీసి ముక్కలు కొరికితింటూ, తక్కిన పిల్లలతో ఆటలాడుకోసాగాడు.

ఊరందరూ కష్టపడి నగరం రక్షించుకొంటూవుంటె, ఇటువంటి అపదసమయంలో ఈ కొంటెవాడు నిశ్చింతగా ఆటలాడుకొంటూ కూర్చుంటాడా అని కోపం వచ్చి, రాజు తన చేతనున్న బెత్తంతో వాడి వీపుమీద చుర్రుమని ఒక దెబ్బవేశాడు.

చిత్రమేమిటో కాని, రాజు వేసిన ఆ దెబ్బకు అక్కడ వుండే అందరి వీపులూ



చుర్రుమన్నాయి. అందరి వీపులమీదా ఆనవాలు పడింది. ఎవరిమట్టుకు వారే వీపులు తడిమిచూచుకోసాగారు. అందరితో పాటు రాజు వీపుమీదా దెబ్బ తగిలింది. రాజు వీపుపైనా ముద్రపడింది! ఎప్పుడైతే వీపుమీద చుర్రుమన్నదో, ఆ క్షణమందే రాజుకు జ్ఞానోదయమైంది! ఆ కుర్రవాడు పరమేశ్వరుడే అని తెలుసుకొని తప్పు క్షమించి అనుగ్రహం చూపమంటూ రాజు బాలుని ప్రార్థించాడు.

కాని, అప్పటికప్పుడె బాలుడు అంతర్హితుడైపోయాడు. ఇందుకుతోడు, అక్కడి ప్రజలంతా ఒక వింతవిషయం చెప్పుకోసాగారు: ఎంతమంది యత్నించినా వైగానదిగట్టు కట్టుపడలేదని, ఆటలాడుతూ పాటలు పాడుతూ ఆ పెంకెబాలుడు తాని చేతితో కొంచెం మన్నుతీసి వేసేసరికల్లా నదిలోని నీరు పొంగటం నిలిచిపోయిందనీ, ఆబాలుని మహిమవల్లనే నీళ్ళు గట్టుదాటి రాకుండా, నగరం రక్షింపబడిందనిన్నీ.

ఈ మాటలు చెవిని పడేటప్పటికి, రాజుకు మరీ విస్మయం కలిగింది. ఏమైనా సరే, 'ఆ చిన్నారి పెంకెబాలుడు మళ్లీ కంట పడేవరకూ ఇక్కడినుండి కదలనేకదలను' అని భీష్మించుకు కూర్చున్నాడు.





ఇటువంటి దీక్ష పట్టివున్న రాజుకు అప్పుడు యిలా మాటలు వినబడ్డాయి: 'రాజా! నీ ఆస్థానంలో ఉన్నటువంటి మంత్రి మాణిక్యుడు సామాన్యుడనుకొంటున్నావు కాబోలు. అతడు నాశిష్యుడు. గొప్ప భక్తుడూ, మహిమాన్వితుడూసుమా. ఇప్పుడైనా, తెలుసుకో!' అని.

తక్షణమే రాజు మాణిక్యవాచకర్ వద్దకు స్వయంగా వెళ్ళి క్షమాపణ చెప్పుకొని, అతనిని చెర విడిపించాడు.

వాచకర్ 'తిరుప్పెందురై' అనే వూరిలో నిశ్చింతగా శివారాధన చేసుకొంటూవుండగా, చిదంబరం వెళ్లవలిసిందని శివుని ఆజ్ఞ ఐంది. ఆ ప్రకారం మాణిక్యవాచకర్ చిదంబరం వెళ్ళాడు. అక్కడకు ఒక జైన సన్యాసి తన మతంప్రచారం చేయటంకోసం వచ్చాడు. వాచకర్‌కూ ఆ జైనసన్యాసికీ మధ్యని తీవ్రమైన వాదోపవాదాలు జరిగినై. అందులో ఆ సన్యాసి నెగ్గలేకపోయాడు పైగా 'మూగదైన చోళరాజు కూతురును మాటాడించగలిగావంటే నేను ఓడిపోయినట్టు అంగీకరిస్తాను' అన్నాడు.

అప్పుడు మాణిక్యవాచకర్ పరమేశ్వరుని కృపవల్ల, ఆ జైనసన్యాసి తనను వేసిన అడ్డుప్రశ్నలన్నిటికీ ఆ మూగబాలిక చేతనే జవాబులు చెప్పించాడు.

ఆ అమ్మాయి నోటివెంట వచ్చే యుక్తియుక్తమైన చక్కటి జవాబులు విని జైనప్రచారకుడూ, అక్కడవున్న అందరూ ఆశ్చర్యభరితులయ్యారు. అప్పుడు జైన సన్యాసి మాణిక్యవాచకర్‌కు సాష్టాంగపడి, ఆయనకు ప్రియశిష్యుడై, వెంటనే శైవ మతాన్ని అవలంబించాడు.

తరువాత మాణిక్యవాచకర్ అనేక పుణ్య క్షేత్రాలు దర్శించుకొంటూపోయి, చివరకు పరమేశ్వరునిలో ఐక్యమయ్యాడు.






ఒకప్పుడు గురుగోవిందు నిండుకొలువులో వుండగా, సేవకులు ఒకనిని దర్బారులోకి తీసుకవచ్చి, ఆయన ఎదుట నిలబెట్టారు. "ప్రభూ!—ఈతనిపేరు 'కన్హయా.' ఇతను పరమ ద్రోహి అని తెలియటంచేత, దేవర యెదుటకు తీసుకవచ్చాము" అని చెప్పారు.

కన్హయా మర్యాదస్థుడు, ఉదారుడు, మంచిహృదయం కలవాడు. ఈ సంగతి గురుగోవిందుకు బాగా తెలుసు. "సరే. ఇతను చేసిన తప్పేమిటి?" అని గురుగోవిందు వాళ్ళను అడిగాడు.

"ప్రభూ! మన వీరులు వెళ్లి ఒక పరసనించి శత్రుసైనికులను సంహరిస్తూవుంటే, కొనప్రాణాలతో వున్న ఆ ముస్లింసైనికుల గొంతుకలలో నీళ్లు పోస్తాడట ఈయన. మహరాజ్, ఎలా వుందో ఈ స్వామిద్రోహం చూడండి!" అని వాళ్లు విన్నవించుకొన్నారు.

ఈ మాటలు వినగానే, గురుగోవిందు కన్హయాను పిలిచి, 'ఏమి చెబుతావయ్యా?' అని ప్రశ్నించాడు.

అందుకు కన్హయా ఇలా సమాధానం చెప్పాడు: 'మహరాజ్!—నేను యుద్ధరంగంమీద ఉండగా, నాదృష్టికి హిందూ సైనికులెవరో, ముస్లింసైనికులెవరో తేడాయేమీ తెలియకుండావుంది. క్షతగాత్రుడైన ప్రతి వీరునిలోనూ నాకంటికి దైవస్వరూపమే కనిపిస్తూవుంది. అందుచేత, వారు వీరు అనే భేదం పాటించక, వీరుడన్నవాడికల్లా

కె. ఆనందమూర్తి

నా చేత నైనట్టుగా సేవచేసుకొంటున్నాను. ఇదే నావల్ల జరిగిన తప్పు."

అమృతతుల్యాలైన ఈ పలుకులు గురు గోవిందుకు మేరలేని సంతోషాన్ని కలిగించినై. వెంటనే కన్హయాను చేరదీసుకొని ఆయన ఆశీర్వదించాడు.

అంతే కాదు. తన పెట్టెలోనించి ఒక డబ్బాతీసి కన్హయాకు ఇచ్చి "నాయనా!— పడిపోయిన వీరులకు—ఆ వీరులు ఏజాతికి చెందినాసరే—నీళ్ళివ్వటమే కాదు. ఈ తైలం తీసుకొని, వారి గాయాలకు రాసి, కట్లు కట్టి నయంచెయ్యి. జ్ఞానివైన నీవు ఒక్క సంగతి జ్ఞాపకముంచుకో—ఇప్పుడీ యుద్ధంలో పోరాడుతున్నది హిందువులూ ముస్లిములూ కాదు. ఎంతమాత్రమూ కాదు. ధర్మదేవత బయల్దేరి అధర్మాన్ని అణిచివేయటానికి యత్నిస్తున్నది. ఈ సంఘర్షణే లేకుంటే, మనందరమూ ఒక్కటే. మనలో మనకు భేదం లేదు, ద్వేషమూ లేదు," అని బోధ చేశాడు.

గురువాజ్ఞ ప్రకారం ప్రియశిష్యుడైన కన్హయా ఆ తైలండబ్బా చేతపుచ్చుకొని, మానవసేవ చేసి తరించటానికని మళ్ళీ యుద్ధరంగానికి బయల్దేరాడు.

తక్కిన శిష్యులందరూ కన్హయాను చూచి ఆశ్చర్యపోయారు. అప్పటినించీ ఆయనను అనుసరించి తరించటానికే వారు ప్రయత్నించారు.



# 9 మాహాత్మ్యం

(1) 9-వ ఎక్కం వెయ్యి. ఒక్కొక్క వరుసలో గుణించగా వచ్చిన ప్రతి మొత్తానికి చివర వరుసగా 1 మొదలు 10 వరకూ వేసి కలుపు. వచ్చే మొత్తాల చిత్రం కనిపెట్టు:

| | |
|---|---|
| $9 \times 1 = 9 + 1 = 10$ | $9 \times 6 = 54 + 6 = 60$ |
| $9 \times 2 = 18 + 2 = 20$ | $9 \times 7 = 63 + 7 = 70$ |
| $9 \times 3 = 27 + 3 = 30$ | $9 \times 8 = 72 + 8 = 80$ |
| $9 \times 4 = 36 + 4 = 40$ | $9 \times 9 = 81 + 9 = 90$ |
| $9 \times 5 = 45 + 5 = 50$ | $9 \times 10 = 90 + 10 = 100$ |

—బి. వీరణ్ణ; గుంతకల్

(2) 9 అంకెలతో వేసిన ఈ జంటగుణకారంలో వేడుక గమనించు:

```
   11223344556677889
                  99
  ------------------
   10101010101010101
  10101010101010101
  ------------------
  111111111111111111
```

వల్లమాని - హనుమాయమ్మ, అమలాపురం

(3) 9 కి సంబంధించిన గుణకారంలో మరిఒక విశేషం:

$1 \times 9 + 2 = 11$
$12 \times 9 + 3 = 111$
$123 \times 9 + 4 = 1111$
$1234 \times 9 + 5 = 11111$
$12345 \times 9 + 6 = 111111$
$123456 \times 9 + 7 = 1111111$
$1234567 \times 9 + 8 = 11111111$
$12345678 \times 9 + 9 = 111111111$
$123456789 \times 9 + 10 = 1111111111$

—దేశాయిశెట్టి. గణపతిరావు: ఉడూరు

(4) 696969 అనే అంకెకు అదే సంఖ్య కలుపు. మొత్తం 1393938. ఇందులో 969696 తీసివెయ్యి. మిగులు 424242. దీనికి 242424 కలుపు. మొత్తం 666666. ఇప్పుడు పై 696969 లోనించి ఈ 666666ను తీసివేస్తే 30303. ఈ సంఖ్యలో అంకెలను కలిపితే $3 + 3 + 3 = 9$. —ఎల్. ఆర్. రావు; జమురియా




# పగ తీర్చిన పాగా

మహారాష్ట్రసంస్థానానికి మంథూరు అనే పట్టణం రాజధానిగా ఉండేది. ఆ సంస్థానాధీశ్వరుడైన జయదేవుడు ఒకనాడు కొలువు తీర్చి ఉండగా చారణు డొకడు వచ్చి, రాజు మీద ఆశువుగా పద్యాలు చెప్పి అనేక విధాల స్తోత్రం చేశాడు.

భట్రాజులు వచ్చి కవిత్వంచెప్పి స్తోత్రం చేసినప్పుడు రాజులు సంతోషించి ఆ భట్రాజులను సత్కరిస్తారు. కాని జయదేవునికి కవులన్నా భట్టులన్నా కిట్టదు.

అందుచేత ఆయన ఆ భట్టుకు బహుమానమివ్వలేదు సరికదా, రోషంవచ్చేమాట లన్నీ అని అవమానించి సాగనంపాడు.

ఆ భట్రాజు కోపంతో తిట్టుకొంటూ, అక్కడనుంచి తిన్నగా హరవంశస్థుల రాజధాని ఐన బుహోడాపట్టణానికి పోయి, కోటగుమ్మంవద్ద కాచుకొని కూచున్నాడు. ఆ రాజ్యాన్ని పాలించే రాజుపేరు 'అలాహరుడు.' ఆయన వేటకువెళ్ళి తిరిగి వస్తున్నాడని తెలుసుకొనే చారణుడు కోటగుమ్మం వద్ద కనిపెట్టుకున్నాడు.

మరికొంతసేపటికి అలాహరుడు పరివారంతో తిరిగివచ్చి కోటప్రవేశిస్తోంటే భట్టు "రాజమార్తాండా, రాజాధిరాజా, జయీభవా! దిగ్విజయీభవ!" అని ఆశీర్వదించాడు.

అలాహరుడు సంతోషించి, "ఏంకావాలో కోరుకోవయ్యా," అని అన్నాడు. ధనమో, బంగారమో, మడులో మాన్యాలో అడుగుతాడనుకున్నాడు రాజు. కాని భట్రాజు, "ప్రభూ!—తమ తలపాగా నాకు దయ చేయించండి," అని అనేసరికి రాజు ఆశ్చర్య పోయాడు.

"నా పాగా కోరుకోవటంవల్ల నీకేమిటి ప్రయోజనం? ఇది నీకు కూడు పెడుతుందా, గుడ్డ పెడుతుందా? మడులో, మాన్యాలో కోరుకోవాలిగాని గుడ్డముక్క

పాలంకి వెంకటరామచంద్రమూర్తి



కావాలంటావేమిటి పిచ్చివాడా?" అన్నాడు. అందుకు చారణుడు, "ప్రభూ! తమ తలపాగా పెట్టుకు తిరగాలని కోర్కెగా వుంది నాకు. దీన్ని ధరించి దేశదేశాలా తమకీర్తి వ్యాపింపజేస్తాను" అన్నాడు.

అలూహరుడు అడితప్పని రాజు. ఏది అడుగుతే అది ఇస్తానన్నాడు గనుక వెంటనే పాగా తీసి భట్టుకు ఇచ్చివేశాడు. తురాయితోటీ జరీబుటేదారుపనితోటీ ప్రకాశించే ఆ పాగా ధరించి భట్టు, ఒక మహారాజుకుమల్లే ఠీవిగా వెళ్ళిపోయాడు.

అతడు అలాగ పోతూంటే చూచిన వాళ్ళందరూ, "వీడొక పిచ్చివాడు!" అనుకున్నారు. ఆరోజంతా పట్టణవాసులు ఆ సంగతి వింతగా చెప్పుకొని నవ్వుకున్నారు. తరువాత క్రమంగా ఆ సంగతే మరిచిపోయారు.

కొన్నాళ్లయాక, అలూహరుడు కొలువు దీర్చి వుండగా ఆ భట్రాజే వచ్చి, నలిగిపోయివున్న ఆ తలపాగాను రాజుఎదుట పెట్టి, వెక్కి వెక్కి యేడువసాగాడు.

"ఏమయ్యా, ఎందుకు అలా దుఃఖిస్తున్నావు?" అంటూ రాజు ఆత్రంతో అడిగాడు. అందుకు భట్టు, "ఏమని విన్నవించను ప్రభూ!—దేవరకు నామూలాన్న అవమానం జరిగిపోయింది!" అన్నాడు. "ఏం జరిగిందేమిటి?" అని ఇంకా ఆత్రంతో ప్రశ్నించాడు రాజు.

"తమ పాగాను ధరించి దేశదేశాలూ తిరిగి, రాజులను సందర్శించి కవనం చెప్పాను. ఆ రాజులకు వంగి నమస్కరించటానికి ముందుగా తమ పాగాను నా తల పైనుండి తీసి, కుడిచేతితో పట్టుకుని, ఎడం చేతితో సలాంచేసేవాణ్ణి. 'ఎందుకు ఇలాగ చేస్తున్నావు?' అని వారు అడిగినప్పుడు, 'ఇది అలూహరసార్వభౌములవారి పాగ! ఈ పాగ ఇతరులకు వంగి నమస్కరించదు! అని చెప్పేవాణ్ణి" అన్నాడు.

45

ఈ పలుకులు విని అలూహరుడు సంతో షించాడు. సభలోనివారంతా "సెభాష్, చారణా! మహారాజుగారి గౌరవాన్ని నిల బెట్టావోయి!" అని మెచ్చుకున్నారు.

"తమ గౌరవాన్ని తుదివరకూ కాపాడ లేకపోయాను ప్రభూ. మార్వారురాజు ఐన జయదేవుని సంస్థానంలో ప్రభువుల పాగాకు అవమానం జరిగింది" అన్నాడు.

"ఆఁ! ఏంజరిగింది?" అని మళ్ళీ ప్రశ్నించాడు రాజు.

"యథాప్రకారం తలపాగ తీసి నేను నమస్కరించేసరికి ఆయన తక్కిన రాజు లకుమల్లేనే నన్ను అడగటం, నేను జవాబు చెప్పటం జరిగింది. కాని తక్కిన రాజు లకుమల్లే తమ గొప్పను గుర్తించి ఊరుకో టానికి బదులు జయదేవుడు మండిపడుతో గద్దెపైనుండి లేచివచ్చి నా చేతనున్న ప్రభువుల తలపాగాను తన కాలితో తన్ని నన్ను కొట్టించి తరిమివేశాడు" అని మనసుకు నాటేటట్టు చెప్పాడు.

ఈమాటలు విని అలూహరుడు మండి పడ్డాడు. ఇందుకుతోడుసభలోవాళ్లంతా "మా ప్రభువులను అవమానం చేసిన ఆ జయ దేవుడికి బుద్ధివచ్చేటట్టు చెయ్యాలి!" అంటూ పురెక్కించారు. "సేనలు పంపాలి!




జయదేవుని పొగరు అణచాలి!!" అని ఆవేశంతో గగ్గోలుపెట్టారు.

సభలోని ఒక వృద్ధమంత్రి, "ఒక గుడ్డపేలికను గురించి పరరాజుతో కయ్య మెందుకయ్యా?" అన్నాడు. కాని వినిపించు కొనే వారెవరు, ఆ సందట్లో?

అలూహరుడే స్వయంగా సేనలను నడి పించి మార్వారురాజధాని ఐన మండూ రును ముట్టడించాడు. జయదేవునికీ అలూ హరునికీ మధ్యని గొప్ప యుద్ధం జరిగింది. జయదేవుడు మరణించగా, మండూరుకోట అలూహరుని వశమైంది. తన పగ తీరిందని భట్టు మనసులో సంతోషించాడు.




# సాహసుడు

గొప్పగొప్ప రాజులు పరిపాలించిన ఉజ్జయిని నగరాన్ని ఒకప్పుడు నీతి పాటించని ఒక రాజు పాలించాడు. అతడు అసమర్థుడు కూడా. అతని దుర్మార్గాన్ని సహించలేక ప్రజలలో గట్టివాళ్లు నాయకత్వం వహించి రాజుమీద తిరుగుబాటు లేవదీశారు. ప్రజల ఆగ్రహానికి వెరచి దుష్టుడైన రాజు ఉజ్జయిని విడిచి పారిపోయాడు.

ఉజ్జయిని సమీపంగా నర్మదానది ప్రవహిస్తుంది. నర్మదకు ఆవలి ప్రాంతాన్ని రాజమార్తాండుడు పాలించేవాడు. రాజ్యభ్రష్టుడైన ఉజ్జయినిరాజు రాజమార్తాండుని శరణుజొచ్చాడు. రాజమార్తాండుడు ఉజ్జయినిరాజు దుర్మార్గాన్ని తలచక, అతనికి కలిగిన అపదనుమాత్రమే చూసి జాలిపడి, ఉజ్జయినిని తన సేనలతో జయించటానికి సిద్ధపడ్డాడు.

ఈలోపుగా ఉజ్జయినిలో ప్రజారాజ్యం ఏర్పడింది. దేశంలోని పెద్దలూ చిన్నలూ, యువకులూ యోధులూ కొత్తప్రభుత్వాన్ని గట్టిగా బలపరిచారు. అక్రమమైన శాసనాలు రద్దయాయి. వృత్తి వాణిజ్యాలు సక్రమంగా, అధికారుల ఒత్తిడి లేకుండా సాగాయి. ప్రజలకు చోరభయమూ, ప్రాణభయమూ లేకుండా పోయింది. తమకొక కొత్తజీవితం ప్రారంభమైనట్లు ప్రజలు సంతోషించారు.

ఈ సమయంలో రాజమార్తాండుడి యుద్ధయత్నాలను గురించి ఉజ్జయినికి వేగులద్వారా వార్త తెలిసింది. దేశ పరిపాలనకు ఎన్నుకోబడిన వృద్ధులూ, వారికి తోడుగా వున్న మధ్యవయస్కులూ ఈ వార్త విని కంగారుపడ్డారు. ఉజ్జయినికి సైనిక బలంచాలకొద్ది. చూడగా రాజమార్తాండుడు యుద్ధంలో ఆరితేరినవాడు. సైనికులను

వై. రత్నాబాయి





అయుత్తం చేయడానికైనా ఉజ్జయిని ప్రజలకు వ్యవధి లేకపోయింది.

రచ్చపట్టులో బహిరంగసభ జరిగింది. యువకులంతా సభకు హాజరయ్యారు. "ఉజ్జయిని రక్షించబడాలి," అనే నినాదాలు మిన్నుముట్టాయి.

"ఉజ్జయినిని ఎవరు రక్షిస్తారు ? యెలా రక్షిస్తారు? ఉపాయం చెప్పగలవాళ్ళు ముందుకు రండి," అని అడిగారు పెద్దలు.

యువకులలోనుంచి విక్రముడనేవాడు ముందుకు తోసుకువచ్చి, "ఇరవైమంది యోధులను నాకివ్వండి. నేను ఉజ్జయినిని రక్షిస్తాను," అన్నాడు.

ఈ మాటవిని అందరూ ఆశ్చర్యపోయారు. ఇరవైవేలమంది ఆరితేరిన సైనికులను ఈ విక్రముడు ఇరవైమంది యోధులతో ఎదిరిస్తాడా ? ఎలా సాధ్యమవుతుంది ?

ఈ ప్రశ్నకు విక్రముడు ఈవిధంగా సమాధానం చెప్పాడు :

"ఉజ్జయినికి రాజమార్తాండుని సైన్యాలు రావడానికి ఒకేఒక మార్గం ఉన్నది. అది నర్మదానదిపైన గల వంతెన. ఆ వంతెనపైన ఒకడివెనుక ఒకడుమాత్రమే నడవగలరు. ఈ వంతెనను రాజమార్తాండుని సైనికులయినా ఒక్కొక్కడే దాటాల్సివుంటుంది. వంతెనమీది స్తంభాలచాటున మన యోధులు నిలబడినట్టయితే ఒక్క పురుగుకూడా దాటిరాకుండా కడతేర్చవచ్చు. ఈలోపుగా అవసరమైతే ఈ యోధులే వంతెననుకూడా పడగొట్టవచ్చు. కనుక రాజమార్తాండుని సైనిక బలాలు చూసి మనం బెదరవ నవసరంలేదు."

ఈ మాటలకు అందరూ హర్షించారు. అప్పటికప్పుడే ఇరవైమంది యువకులు విక్రముడివెంట వెళ్ళడానికి ముందుకు వచ్చారు. వీరికి కత్తులూ, గుర్రగొడ్డళ్ళు ఇచ్చి విక్రముడు సాధ్యమైనంత వేగంగా నర్మదాతీరాన్ని చేరుకున్నాడు. వంతెన






స్తంభాల చాటున తాము నిలబడడానికి వారు ఏర్పాట్లు చేసుకున్నారు. వంతెనమీద నడిచేవారిని వీరు సులభంగా వధించగలరు. కాని, నడిచేవారికి మాత్రం ఈ యోధులు చిక్కటానికి సావకాశం లేదు.

సూర్యోదయమవుతూనే రాజమార్తాండుని సైనికులు కొయ్యవంతెన దాటడానికి ప్రారంభించారు.

వంతెనమీద అందరికన్న మొదట నిలబడ్డాడు విక్రముడు. ముందు వంతెన ఎక్కివచ్చేవారిని విక్రముడు తన కత్తికి బలిచేయసాగాడు. రాజమార్తాండుని సైనికులు నివ్వెరపడి ఈ అదృశ్య మృత్యువును అర్థంచేసుకోలేకపోయారు. దానిని అన్వేషించటానికి ముందుకువచ్చి, వారుకూడా విక్రముడి కత్తికి బలిఅయినారు. మిగిలినవారు బెదరి వెనక్కి తిరిగిపోయినారు.

ఈ వార్త వినగానే రాజమార్తాండుడు నిర్ఘాంతపోయినాడు. వంతెన మీద రహస్యంగా దాగి తన సైనికులను పొట్టబెట్టుకొంటున్న యోధుల ఆట కట్టించడానికి అతను ఎన్నో ఉపాయాలు ఆలోచించాడు. నది ఈదడానికీ, చిన్నచిన్న తెప్పలమీద నది దాటడానికీ చాలామంది సైనికులు యత్నించారు. కాని సగందారిలో ఉండగానే అవతలిగట్టునవుండే చెట్లచాటునుండీ, పొదల చాటునుండీ బాణాలువచ్చి వారిని నదికి బలియిచ్చాయి.

వంతెనను రక్షించే యోధుల పరిస్థితి కూడా ఏమంత క్షేమంగా లేదు. ఎందుచేతనంటే, రాజమార్తాండుని సైనికులు చనిపోయినవారి శవాలను అడ్డంపెట్టుకోవడంతో యోధుల కత్తివేట్లు తప్పించుకొని, వంతెన మీద కొంతదూరం ముందుకు పోగలిగారు. స్తంభాలమాటున వున్న యోధులలో కొందరిని మట్టుకు దెబ్బతీయగలిగారు.

రాజమార్తాండుని సైనికులు ప్రాణాలను లక్ష్యపెట్టక ముందుకు ఉరికినట్టయితే

వంతెన వారివశం కాకతప్పదని విక్రముడు గ్రహించాడు. రాజమార్తాండుడు తన సైనికుల ప్రాణాలను లక్ష్యపెట్టేటట్టు లేదు.

గండ్రగొడ్డళ్ళతో వెనుకనుంచి వంతెనను పడగొట్టుకురమ్మనీ, వంతెన పడిపోయేటప్పుడు వెనుకవారిని వెనుకనుంచే వెళ్ళిపొమ్మనీ విక్రముడు తన అనుచరులకు ఆజ్ఞయిచ్చాడు. విక్రముడు తప్ప మిగిలినవారంతా వంతెనను ధ్వంసంచేస్తూ, తీరా అది విరిగిపడే సమయానికి అవతలి ఒడ్డుకు చేరుకోసాగారు. కొద్దిసేపట్లోనే దాదాపు వంతెనఅంతా విరిగిపడి నర్మదలో కొట్టుకుపోయింది.

విక్రముడు తప్ప మిగిలినవారంతా అవలి ఒడ్డుకు చేరుకున్నారు. రాజమార్తాండుడి భటులు విక్రముణ్ణి ప్రాణాలతో పట్టుకున్నారు. ఖైదీల శిబిరానికి పట్టుకుపోయారు.

ఆరాత్రి రాజమార్తాండుడూ, ముఖ్యులైన అతని అనుచరులూ గుడారాల మధ్య చలి మంటచుటూ కూర్చుండి మాట్లాడుకుంటూ వుండగా అక్కడికి భటులు విక్రముణ్ణి పెడరెక్కలు విరిచికట్టి తెచ్చారు. ఆ మంటల కాంతిలో విక్రముడి అవతారం దేదీప్యమానంగా కనిపించింది.




"నేను పిరికిపందను కాను. పారిపోను. నన్ను పెడరెక్కలు విరిచికట్టనవసరం లేదు. నా చేతులు వదిలించండి," అన్నాడు విక్రముడు.

"స్తంభంచాటున వుండి సైనికులను సంహరించిన నీవు శూరుడివీ, ధీరుడివీ ఎట్లా అవుతావు?" అన్నాడు రాజమార్తాండుడు పళ్ళు కొరుకుతూ.

"అధర్మయుద్ధానికి నియమాలేమిటి?" అన్నాడు విక్రముడు.

"నాదా అధర్మయుద్ధం?"

"అవును! ముమ్మాటికీ. మీరు మామీద యుద్ధం ప్రకటించలేదుగా?"



"అరాజకదేశంమీద యుద్ధంప్రకటించేదేమిటి ?"

"మాదేశానికి ప్రజలే రాజులు. మాది ప్రజారాజ్యం."

"ప్రజారాజ్యం ఒక రాజ్యంకాదు. అది నిలబడదు."

"మేము మా రాజ్యాన్ని నిలబెట్టుకుంటాము. నా చేతులు విప్పించండి. నేను మీతో మాట్లాడాలి," అన్నాడు విక్రముడు.

రాజమార్తాండుడు అతని చేతులు విప్పించి, పక్కనే కూర్చోబెట్టుకున్నాడు.

"నేను మీదేశాన్ని క్షణంలో నాశనం చేస్తాను. నీవంటి పిరికిపందలు నాకు లక్ష్యంలేదు. మీకొక రాజు ఏర్పడేదాకా మీదొక రాజ్యమని నేను గుర్తించను," అన్నాడు రాజమార్తాండుడు.

"మాదేశంలో నావంటి యువకులూ, నన్ను మించినవారూ ఎంతోమంది ఉన్నారు. వారు మారాజ్యాన్ని తమ ప్రాణాలతో కాపాడుతారు. వారి సాహసం ఎటువంటిదో మీకు మచ్చుచూపిస్తాను," అంటూ విక్రముడు తన ఎడమచేతిని గభిమని మంటలలోకి చాచాడు.

క్షణంలో అతని చెయ్యి కాలసాగింది. అయినా విక్రముడు తనచేతిని వెనక్కు తీయలేదు. కాలుతూన్న చేతికేసి చూస్తూ విక్రముడు ఇలా అన్నాడు :

"మేము సాహసులం. చిత్రహింసలు చేసినా మీరు మమ్మల్ని జయించలేరు. మేము మా ప్రజారాజ్యాన్ని కాపాడటానికి ఎంత త్యాగమైనా చేస్తాం!"

విక్రముడి సాహసానికి, నిశ్చలత్వానికి రాజమార్తాండుడు అచ్చెరువందాడు. విక్రముణ్ణి విడిచిపుచ్చి రాజమార్తాండుడు మరునాడే గుడారాలెత్తి తన సేనలతోసహా మరలిపోయాడు.



## బదులు చెప్పు

1. ప్రపంచంలోకల్లా విలువైన లోహం ఏది ?
2. కొమ్మలు లేని మూడుచెట్లు ఏవి ?
3. మొసలి సముద్రంలో ఉండదు. ఎందుచేత ?
4. మొట్టమొదట ప్రపంచపటాన్ని తయారుచేసింది ఎవరు ?
5. కోతిజాతిలో పెద్దది ఏది ?
6. ఎద్దు లేవబోయేటప్పుడు ఏ కాళ్లు ముందు కదిలిస్తుంది ?
7. పువ్వులు పూయకుండా కాయలు కాసే చెట్లు ఏవి ?
8. బట్టలుతికే సోడా దేనినుండి తయారుకాబడుతున్నది ?
9. ఆటంబాంబ్ కనిపెట్టింది ఎవరు?
10. ఒక నిమిషంలో మనం యెన్ని సారులు ఊపిరి తీస్తాము ?
11. రెండుశేర్లు నీళ్ళకు శేరు ఉప్పు కలిపితే ఎంత ?
12. ఒలింపిక్ క్రీడలు ప్రారంభించిన దేశసులు ఎవరు ?

---

1. రేడియం, 2. తాటి, ఈత, కొబ్బరిచెట్లు, 3. ఉప్పునీటిలో ఉండలేదు, 4. తాలమీ, 5. నిఫెన్సీ, 6. వెనుకకాళ్లు, 7. అనాస, అత్తి, అల్, 8. మామూలు ఉప్పునుండి, 9. ఆటోహాన్, 10. ఇరవై ఐదు సార్లు, 11. రెండుశేర్లే, 12. గ్రీకులు.

## 'పిచ్చర్'

ఇది ఒక చిత్రమైన మొక్క. దీనికి ఆకలి ఎక్కువ. వేళ్లద్వారా భూమిలో నించి తీసుకునే ఆహారం చాలక, ఇది మాంసాహారం కూడా ఆరగిస్తుంది. అలా ఆరగించటానికి తగిన సాధనం ఈ మొక్కలోనే అమరివున్నది.

బొమ్మచూడండి. ప్రతి ఆకునుండీ ఒక్కొక్క కాడ వేలాడుతున్నది.



ఒక్కొక్క కాడకూ ఒక చిత్రమైన తిత్తి వంటిది ఉన్నది. ప్రతి తిత్తికీ పైన ఒక్కొక్క డిప్ప మూతగా ఉంటున్నది.

ఏదైనా పురుగు వచ్చి తిత్తిపైన వాలగానే టపీమని డిప్ప మూసుకుంటుంది. పురుగు పైకిరాలేదు. ఈవిధంగా ఆ పురుగును కబళిస్తుంది ఈ పిచ్చర్ అనే చెట్టు.

ఇవి అమెరికాలోనూ, మనదేశంలోనూ ఎక్కువ.

*




పూర్వం వింధ్యాచలరాజ్యాన్ని హరిహర రాయలు పాలించేవాడు.

రాయలువారికి ఒకేఒక కుమార్తె విద్యావతి. ఆమెకు యుక్తవయస్సు వచ్చింది. పెండ్లియేర్పాటులు చకచక సాగుతున్నాయి. దేశదేశాలనుంచి నిపుణులైన పనివాళ్లువచ్చి క్రొత్తక్రొత్త భవనాలు నిర్మిస్తున్నారు. మండపాలూ, చిత్రశాలలూ అమరుస్తున్నారు.

పనులన్నీ అయినై. పెండ్లిమండపం కూడా పూర్తిఐంది. మంత్రులతో, పరివారంతోసహా వచ్చి రాయలువారు అన్నీ తిలకించారు. తృప్తిచెందారు. అన్నీ బాగున్నాయి. ఐతే, మండపం గోడలపైన చిత్రాలుమాత్రం సామాన్యమైనవిగానే కనబడుతున్నవి కాని, వాటిలో ప్రత్యేకత ఏమీ గోచరించలేదు. ఇది వక్కటే రాయలువారి అసంతృప్తికి కారణమైంది.

"దేవరా!—అపురూపమైన చిత్రాలను సృష్టించగలవారికి కోరుకొన్న బహుమానమిస్తామని ప్రకటింపిద్దాం. తప్పక సమర్థులు వస్తారు" అన్నాడు మంత్రివర్యుడు.

రాయలవారికి సలహా నచ్చింది.

చాటింపు వేయించారు. కొన్నాళ్ళకు ఒకానొక దూరదేశంనుంచి ఇద్దరు చిత్రకారులు వచ్చారు. ఎవరి ప్రతిభలు వారు చెప్పుకొన్నారు. రెండవ చిత్రకారుడు ఒకే ఒక కోరిక కోరుకొన్నాడు: మొదటి చిత్రకారుడు ఏ గోడమీద చిత్రించదలచుకుంటే దానికి సరీగా ఎదట వుండే గోడపైన తన చిత్రం వేయటానికి అనుమతించాలెనని.

సమ్మతించారు రాయలవారు.

చెరిఒక గోడా నిర్ణయించుకొని, గడువు తీసుకొన్నారు చిత్రకారులు. పని ప్రారంభించారు. సరీగా నెలరోజులయింది. గడువు

---

ఆర్. రామేశం

తిరిగింది. చిత్రకారులిద్దరూ రాయలవారికి కబురుచేశారు. మంత్రి, సామంత, పండిత, పరివారసమేతంగా రాయలవారు విచ్చేశారు. ముందుగా మొదటి చిత్రకారుని గోడవద్దకు వెళ్ళి, తెర తొలగించి చూశారు. రాయల వారూ వారితోపాటు అందరూ ఆశ్చర్యంలో మునిగిపోయారు. ప్రకృతిఅంతా ఆ గోడమీద తాండవిస్తూంది. 'అద్భుతం! అత్యద్భుతం!!' అన్నారు రాయలవారు.

ఎవరి అనుమతిలేకుండానే రెండవ చిత్రకారుడు తన గోడమీది తెరను తొల గించివేశాడు. రాయలవారూ, పరివారమూ దృష్టి అటు తిప్పారు. మంత్రించినట్టు ముగ్ధులైపోయారు రాయలవారు. కొంతసేప టికి తెలివిరాగా, "ఆహాహ !!" అన్నారు.

మొదటిచిత్రకారుని చిత్రణ అతి సహజ సిద్ధంగా వుండి ఆశ్చర్యం కలిగించింది. రెండవవాని చిత్రణ సరీగా అదేచిత్రాన్ని జీవకళ ఉట్టిపడేటట్టు ప్రతిఫలింపజేస్తూ వుంది. ఇద్దరూ ఒకేచిత్రాన్ని ఎలా చిత్రించ గలిగారు? బహుమానం ఎవరికి ఇవ్వటం? —ఇదీ సమస్య.

తరువాత, క్రమంగా ఇందులోని కీలకం అంతా వెల్లడైంది. నిజానికి రెండవ చిత్ర కారుడు ఏచిత్రమూ చిత్రించలేదు. మొదటి చిత్రకారుడు పని ప్రారంభించినప్పటినించీ అతను తన గోడను ఒక విధమైన ద్రవంతో తోమటానికి ప్రారంభించాడు. గడువు నెల రోజులూ అలా మెరుగుపెట్టేటప్పటికి ఆ గోడ అద్దంలాగా తయారైంది. ఈ గోడ మొదటివాని గోడకు సరీగా ఎదురుగా వుండ టంచేత, అతను చిత్రించిన బొమ్మ రెండవ వానిగోడపైన మరింత మెరుగులతో అత్య ద్భుతంగా ప్రతిబింబించింది. ఈ ప్రతి బింబమే రాయలవారినీ, అందరనూ ఆశ్చర్యభరితులుగా చేసింది!



# సీనయ్యా:

—జి. రంగారావు

అనగనగనగా ఒక గ్రామం
అందులోన నో ఆరామం.
దానికి కావలి దానయ్యా
ఆతని కొమరుడు సీనయ్యా.

చదువు సంధెలు లేనట్టి
కొడుకును దానయ తెగగొట్టి
బువ్వ పెట్టనని చెప్పాడూ,
బైటికి పొమ్మని నెట్టాడు.

చేయునదేమిటి సీనయ్యా
పొట్ట "ఆకలని" వాపొయ్యె
కూచొని కూచొని యోచించి
లాగును బాగా బిగియించి
పంతులుఇంటికి పోయాడు
పంతులమ్మతో అన్నాడు :
"అమ్మా! అమ్మా! అయగోరూ
అన్నము తెమ్మని చెప్పారు."

పంతులు భార్యా నమ్మిందీ
టిఫినుతొ అన్నముఇచ్చిందీ.
మోతగ టిఫినుతొ మళ్ళాడు
తీవిగ నడచుచు వెళ్ళాడూ.

దడదడమన్నది గుండెల్లో
పరుగెత్తాడూ సందుల్లో
చెరువుకట్టకే వెళ్ళాడు
చెట్టుక్రింద కూర్చున్నాడు.

టిఫినును విప్పే ఆతురతన్
గబగబ గబగబ తినబోయె
అంతలొ యేదో విన్నాడు
ఆత్రే ముందుకు చూచాడు.

"బాబా! బాబా! ఒకముద్ద,
బంగరునాయన ఒకముద్ద,
ఆకలిమంటకు లోబడ్డ
తల్లికి పుట్టిందీ బిడ్డా.
బాబా! బాబా! ఒకముద్ద
బంగరునాయన! ఒకముద్ద"

"అవ్వా! అవ్వా! భయమేలా?
దిగులెందుకు నీకీవాళా!
బిడ్డకు బువ్వా పెట్టుకుని,
ఆతర్వాత నీవు తిని
అన్నియు చెప్పుకొవచ్చునులే
ఆపై మాటాడొచ్చునులే."

దయతో పాపము సీనయ్యా
ముద్దలు నాలుగు పెట్టైనయా.
'చాల'ని పాపాయ్ చెప్పిందీ
ముసలిది దండం బెట్టింది.

"అవ్వా! ఇకమరి నీవు తిను
చివరకు మిగిలితె నేతింటా"

అప్పుడు ముసలిది అందిగదా :
"అలవాటయ్యా వస్తులకు
గంజినీళ్ళె మా పొట్టలకు.
దినమొక యుగముగ గడుపుదుము
దిక్కులేని యనాథులము."

"అవ్వా అయితే యీలాగు
ఊరికె తిరిగితె యేలాగు?
గాలిలొ దీపం వెలిగించి
దేవుని దానికి ముందుంచి
'నీవే ఉన్నావ్ దేవయ్యా,
దీపాన్నారపబోకయ్యా.'
అంటే లాభం యేముంది?
కష్టిస్తేనే సుఖముంది."

"బాగా చెప్పావ్ బాబయ్యా.
మరి కష్టించుటకు కాదోయ్యా."
"పోనీయ్యవ్వా! బువ్వ తిను
ఆపై నీపని చూచుకొను."

అవ్వకు ఆశా పుట్టిందీ
చేతులు రెండూ చాచింది.
దోసెడు అన్నం సీనయ్యా
దయతో బెట్టెను చూడయ్యా.
మిగిలిన నాలుగు మెతుకులను
నోటికొ బెట్టుకొబోయె నయొ
ఫెళ్ళని వీపు మ్రోగింది,
పంతులు కడుపు పగిలింది.

"ఏంరా? భడవా! యెంతపనీ!
తగియుంటివిరా యెంతకును."
దావురమన్నాడా యబ్బాయ్
జారుకుపోయాడా యబ్బాయ్.

అవ్వా బిడ్డా "మంచోడూ
తను మానుకుని పెట్టాడు"
అనుకున్నారు—అంతేగా
దీనగళముసు—వింటేగా.

సీనయ్యెక్కడి కెళ్ళాడో
యెక్కడ యేమైపోయాడో.
"ఇతరుల కొరకే నీబ్రతుకు
బ్రతుకుటకొరకే ఒక మెతుకు."



# బస్తీ వెళ్లిన భరతమ్మ

ఒకానొక అడవిలో ఒక భరతపక్షి వుండేది. చిన్నప్పటినుంచీ అది ఉపకారబుద్ధి కలది. భూలోకంలో దానికి అయువు నిండిన తరవాత, దాని పుణ్యంకొద్దీ విమానంమీద దేవదూతలు దిగివచ్చి ఆ భరతపక్షిని స్వర్గానికి తీసుకవెళ్లారు.

అక్కడ దేవతలందరూ భరతపక్షిని గౌరవించి "నీకు ఏంకావాలో కోరుకో" మన్నారు. ఏమి చెబుదామన్నా భరతపక్షికి తోచిందికాదు.

కొన్నాళ్ళు స్వర్గంలో సుఖంగా గడచిన తరువాత ఆ భరతపక్షి దేవతల పెద్దవద్దకు వెళ్ళి 'నాకిక్కడేమీ తోచటంలేదు. మళ్ళీ నేను భూలోకానికి వెళ్లి వుండేటట్టు అనుగ్రహించు" మంటూ కోరింది. దేవతలు భరతపక్షికి ఏ రూపం కావాలన్నా పొందవచ్చుననీ, ఏలోకంలో కావలసినా విహరించవచ్చుననీ వరమిచ్చారు. అప్పుడు భరతపక్షి చిన్న చిన్న రెక్కలతో, మానవరూపంలో భూలోకానికి దిగివచ్చింది. దిగివచ్చి, మళ్ళీ తనఅడవిలో, మామూలు స్థలంలో యిల్లు కట్టుకొని కాలక్షేపం చేస్తూవుంది.

ఇలా వుండగా ఒకరోజున—

భరతమ్మకు చిన్నప్పటి సంగతి ఒకటి జ్ఞాపకానికి వచ్చింది: చిన్నప్పుడు భరతమ్మ, బస్తీలో వుండే తాతగారింటికి వెళ్ళిందిట. ఆ బస్తీలో ఎన్నో సౌకర్యాలున్నాయి. ఎన్నో వినోదాలున్నాయి. అందుచేత అక్కడ తోచకపోవటమనేది ఉండదు. ఎప్పుడూ ఆనందంగా కాలం గడపవచ్చు.

ఇప్పుడు భరతమ్మకు ఆ చిన్ననాటి ముచ్చట జ్ఞాపకం రావడంతో బుద్ధిమళ్లింది. "ఈ అడవిలో ఒక్కరైనా ఏమీ తోచకుండా ఎలా కాలక్షేపంచేసేది? బస్తీలో మా తాతగారింటికి వెళతాను. అన్ని సౌఖ్యాలూ అనుభవిస్తూ అక్కడే ఉండిపోతాను. ఇక

కె. చిట్టిబాబు



ఈ అడవికి తిరిగి రానెరాను, 'బస్తీ భరతమ్మ' అని అనిపించుకుంటే నాకు గౌరవంకూడాను" అనుకుంది.

అనుకొని, 'బస్తీకి వెళ్ళదామని నిశ్చయించుకుంది. ఈ నిశ్చయంతో భరతమ్మ ఉదయానే భోజనంచేసుకుని, మంచి మంచి దుస్తులతో ముస్తాబుచేసుకుంది. ప్రయాణానికి కావలసిన డబ్బు జాగ్రత్తపరుచుకుంది. ఇంటి తలుపులు తాళంవేసింది. తాళంచెవి కిటికీ ఊచలలో దాచింది. కాలినడకని బస్తీకి వెళదామని బయలుదేరింది.

తీరా బయలుదేరి రెండడుగులు వేసే సరికల్లా "భరతమ్మా! భరతమ్మా!!" అంటూ ఒక లేడిపిల్ల పరుగెత్తుకువచ్చింది. అది భయంతో వణికిపోతున్నది. వెనక్కు వెనక్కు తిరిగిచూస్తున్నది.

"ఏఁవమ్మా, లేడెమ్మా! ఇలావచ్చావు?" అని లేడిపిల్లను అడిగింది భరతమ్మ.

"ఏమిటేమిటి? మన అరణ్యంలో వేటకాండ్రు ప్రవేశించారు. తుపాకీలు చేతపట్టుకొని కనబడ్డ జంతువునల్లా తరుముకు వస్తున్నారు. నన్ను కాస్త నీ యింట్లో తల దాచుకోనిస్తావా భరతమ్మా!" అని బతిమాలుకుంది.

సరే. జాలిగుండె గల భరతమ్మ దాచుకొన్న తాళంచెవి బయటకు తీసి, తలుపు తాళం తెరిచి, లేడిపిల్లను లోపల ప్రవేశపెట్టి, 'అమ్మడూ!- పెరట్లో సమస్తమైన కూరలూ వున్నాయి, ఫలజాతులున్నాయి. నీ యిష్టం వచ్చినట్టూ స్వేచ్ఛగా వుండు' మని చెప్పి, మళ్లీ తలుపు తాళంవేసుకొని, తాళంచెవి కిటికీఊచలలో దాచుకుని, బస్తీలో తాతగారింటికని బయల్దేరింది.

తీరా బయల్దేరి రెండడుగులు వేసేసరికల్లా "భరతమ్మా! భరతమ్మా!!" అంటూ ఒక దీనాలాపం వినిపించింది. మళ్ళీ ఎవరో ఆపదలో చిక్కుకొనివుంటారని అనుకుంది భరతమ్మ. అనుకొన్నట్టుగానే చూడగా,

ఒక బాతు ఉరకలు వేసుకొంటూ తన యింటికి రావటం కనిపించింది.

"ఏఁవమ్మా బాతమ్మా! ఇలావచ్చావు?" అని అడిగింది భరతమ్మ.

"ఏమిటేమిటి? మావాళ్లంతా కొలనుకు స్నానానికి వచ్చారు. నేను జలకాలాడే సరదాలో వాళ్ళు రమ్మనగానే తిరిగిపోలేదు. వాళ్లు యిళ్ళకు వెళ్ళిపోయారు. నేను తప్పిపోయాను" అని చెప్పింది.

అందుకు భరతమ్మ బాతును బుజ్జగించి, "బాతమ్మా, బాతమ్మా! నీకు వచ్చిన భయమేంలేదు. మా పెరట్లో పెద్ద కొలను ఉన్నది. ఆకొలనులో నీ యిష్టంవచ్చినట్టుగా జలకాలాడుకోవచ్చు. నీకు లేడెమ్మ సాయం వుంటుందిలే. నేను మా తాతగారింటికి పోయి తిరిగివచ్చాక నిన్ను మీ ఇంటికి దిగబెట్టిస్తా" నన్నది. ఇలా అంటూ కిటికీ ఊచలలో తాళంచెవి తీసి, తలుపుతెరిచి, బాతమ్మను పెరట్లోవుండే కొలనులో ప్రవేశపెట్టింది. తరువాత మళ్ళీ భరతమ్మ తలుపు తాళంవేసుకుని, తాళంచెవి కిటికీ ఊచలలో దాచుకుని, బస్తీలో తాతగారింటికని బయల్దేరింది.

ఇప్పటికే చాలా ఆలస్యమైపోయింది. అందుచేత భరతమ్మ ఈసారి గబగబ అడు




గులు వేయసాగింది. తీరా నాలుగడుగులు వేసేసరికల్లా "భరతమ్మా! భరతమ్మా!!" అంటూ ఒక ఆర్తనాదం చెవినిపడింది. గభీమని వెనక్కు తిరిగిచూసిందిభరతమ్మ.

చూడగా, ఒక చిన్నారి ఉడుత. అది మొహం చిన్నబుచ్చుకొని వున్నది. దానిని చూచి "ఉడుతమ్మా, ఉడుతమ్మా! ఏం ఇలా వచ్చావు?" అని అడిగింది.

'ఏమిటేమిటి? వర్షకాలానికి సరిపడేటట్టుగా గ్రాసం తెచ్చి చెట్టుతొర్రలో పెట్టుకున్నాను. గింజలు పోగుచేసుకు వద్దామని నేను పోయి వచ్చేలోపల ఎవళ్ళో దొంగలు ఒక్క గింజయినా లేకుండా ఇల్లు దోచుకు



పోయారు. ఇన్నాళ్ల రెక్కల కష్టమూ వృధాఐపోయింది. పైగా, ఈపూట వంటకు కూడా ఇంట్లో గింజలు లేకపాయె!" అని తన గోడు వలపోసుకుంది.

ఇందుకు భరతమ్మ "ఓసి, ఈపాటి దానికే విచారమెందుకు ఉడుతమ్మా! మా ఇంట్లో ఎంతతిన్నా తరగని ధాన్యపు గింజలూ పప్పుదినుసులూ నిలవవున్నాయి. నీ యిష్ట మొచ్చినంతకాలం నాతోపాటు ఉండవచ్చు. నేను మళ్లీ వచ్చేదాకా నీకు లేడెమ్మా బాతమ్మా సాయంకూడా వుంటారు." అని చెబుతూ, కిటికీ ఊచలలోనించి తాళం చెవి తీసి, తలుపులు తెరిచి, ఉడుతమ్మను గదిలో గాదెలదగ్గర ప్రవేశపెట్టింది.

భరతమ్మ మళ్ళీ తలుపు తాళంవేసి, తాళంచెవి కిటికీ ఊచలలో దాచింది. తాత గారింటికని మళ్లీ బయల్దేరింది. తీరా ఇంకిప్పుడు సాయంకాలమైపోయింది.

బయల్దేరి ఒక్కడుగువేసిందో లేదో భరతమ్మ మనస్సు మారిపోయి, ఇంటికి మరలివచ్చింది. కిటికీ ఊచలలో దాచిన తాళంచెవి తీసింది. తలుపులు తెరిచింది. దుస్తులు విప్పి, ముస్తాబు తీసివేసింది. హాయిగా పడకకుర్చీలో కూర్చుంది.

"నా ప్రదేశమైన ఈ అడవిలో తోడి జీవు లన్నీ కష్టాలు పడుతున్నవే. వాటి బాధలు చూస్తూ నేనెలా ఇల్లు వదిలి వెళ్ళేది? నా నేస్తులు కష్టాలుపడుతూవుండగా నేను బస్తీ వెళితే అక్కడమటుకు నాకు సుఖ ముంటుందా? ఇదే నా బస్తీ. ఇదే నా స్వర్గం. నేనింక తాతగారింటికి పోను, మరి స్వర్గానికీ పోను. నా నేస్తాలకు తోడుపడుతూ ఈ అడవిలోనే వుండిపోతా" అనుకొన్నది.

చిన్నప్పుడు ఎప్పుడో వెళ్ళివచ్చిన భరతమ్మ మరెన్నడూ బస్తీలో తాతగారింటికి వెళ్లనేలేకపోయింది.



# రంగుల బొమ్మ కథ - 1

గంగులపాలెంలో పూర్వం గంగులు అనే ఒక రైతుబిడ్డ ఉండేవాడు. అతను చాలా మంచివాడు. అందుకనే పెద్దలు పదిమందీ చేరి ఆ వూరికి గంగులుః పేరు పెట్టారు.

ఇలాంటి మంచిపేరు తెచ్చుకున్న గంగులుకు ఒక మనుమడు కలిగాడు. ముద్దుకొద్దీ వాడికి తాతగారిపేరే పెట్టారు. కాని, వాడు దానిని సార్థకం చేసుకోలేకపోయాడు. తాత ఎంత మంచివాడో, మనుమడు అంత గడుగ్గాయి. తాత ఎంతటి సాధువో మనుమడు అంతటి దురుసు. కుర్రవాడి పెంకెచేష్టలు చూచి, ఊళ్ళోవాళ్ళు వాడిని 'గడుగ్గాయి గంగన్న' అంటూ పిలుస్తూవచ్చారు.

గంగులు స్వార్జితంతో ఒక ఇల్లుకట్టి నిలబెట్టిపోయాడు. కాని కొడుకు హయాంలో కుటుంబం చితికిపోసాగింది. మనుమడి ఏలుబడిలో మరీ పేరు లేకుండా పోయింది.

గంగులు కట్టిన ఇంట్లో మనమడు గంగన్న, అనాథఐన వాడి తల్లీ ఉండేవాళ్లు. గంగన్నతో తల్లి ఏ విషయమైనా మనసువిడిచి చెప్పేది. కాని, అంత గొప్పగా బతికిన గంగులు కుటుంబం ఈ దుస్థితికి ఎందుకు వచ్చిందోమాత్రం చెప్పిందికాదు. వాళ్ళకు పాపం, కష్టంమీదనే కాలక్షేపం జరుగుతూవచ్చింది. గంగన్న తల్లి రోజుకొక వస్తువు విక్రయించి, సంసారం గడుపసాగింది.

ఇంట్లో వస్తువులన్ని అమ్మివేయటం, ఆ డబ్బు తినివేయటం పూర్తిఐంది. ఇక మిగిలివున్నదల్లా ఒక్క పాడిఆవు. పొయిలోకీ, పొయిమీదికీ ఏమీ లేకపోవటంచేత 'ఈ ఆవునుకూడా అమ్ముకురమ్మ' ని గంగన్నతో చెప్పింది తల్లి.

గడుగ్గాయిగంగన్న ఆవును తోలుకొని, ఉరకలువేసుకొంటూ సంతకు బయల్దేరాడు. దారిలో ఒక వృద్ధుడు కనిపించి, గంగన్నను పలకరించి, యోగక్షేమాలు కనుక్కొన్నాడు. సంగతిఅంతా విప్పిచెప్పాడు గంగన్న. ఇది విని వృద్ధుడు 'ఒక్! ఈపాటిదానికేనా సంతకు పోవటం? నీ ఆవును నాకిచ్చేయి. బదులుగా చిత్రమైన చిక్కుడుగింజలిస్తాను. అవి నీకెంతటి భాగ్యాన్ని ఇస్తాయో, ఇంటికి పట్టుకువెళ్ళి చూడు. నీకే తెలుస్తుంది' అన్నాడు.

వృద్ధుడు అలా చెప్పగానే నమ్మి, గడుగ్గాయిగంగన్న తన ఆవును వానికి ఇచ్చేసి, వాడిచ్చిన చిక్కుడుగింజలు చేతపట్టుకొని ఇంటికి చేరుకొన్నాడు.

# ముచ్చటైన నాలుగు టైపు చిత్రాలు

గమనిక :

టైపుచిత్రాలు పంపదలచినవారు దళసరి తెల్లకాగితంమీద నల్లరంగు రిబ్బనుతో తయారుచేసి పంపాలి. చుట్టు బార్డర్లలోనూ, బొమ్మలోపలా పేరుగాని, మరెట్టి సంజ్ఞలు గాని టైపు చేయకూడదు.



పంపినవారు :
జి. కోదండపాణి - అనకాపల్లి



పంపినవారు :
ఎస్. ముబారక్ బేగమ్ - తాడేపల్లిగూడెం



పంపినవారు :
హెచ్. ఎస్. వెంకటేశమూర్తి - హాసన్



ఇంకా కృషిచేసి, నేర్పు చూపి, ఇటువంటి బొమ్మలను మా పాఠకులు ఎక్కువగా పంపగలరని ఆశిస్తున్నాము.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1953 అక్టోబరునెల సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్కమాట లోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ ఆగస్టు 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ ఒకపోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## సెప్టెంబరు నెల చందమామలో

ప్రచురింపబడే ఫోటోలకుగాను, ఈ దిగువ ఉత్తమవ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది.

మొదటి ఫోటో : ఆహారమంత్రి | రెండవ ఫోటో : రక్షణమంత్రి

పంపినవారు : మిస్. డి. ఇ. విజయమ్, మతుంగా - బొంబాయి. 19

బహుమతిపొందిన ఈ వ్యాఖ్యలు, పంపినవారి పేరుతోసహా సెప్టెంబరునెలలో ప్రచురిస్తాము. బహుమతిమొత్తం రూ. 10/- సెప్టెంబరుసంచిక వెలువడినవెంటనే పంపబడుతుంది.



వస్తూంది!

విజయ వారి

# చంద్రహారం

డైరెక్టర్
కె. కామేశ్వరరావు
బి.ఏ.





నిర్మాతలు... నాగిరెడ్డి & చక్రపాణి

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26, Controlling Editor: SRI CHAKRAPANI.

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

దేశానికి జెండా

పంపినవారు:
జి. సుబ్బరామమ్మ - బందరు




రంగులబొమ్మ కథ —1 - వ బొమ్మ